# VICHITRA 

 RAGHAVAM



By

Sri Venkata Parthasarathi Kavulu

Sathavathanulu.

శ్రీ

# విచిత్రరాఘవము

(ఆఱంకముల నాటకము)

ఇది

శ్రీ వేంకట పార్థసారథికవులచే

రచింపఁబడినది.



 [వెల 1—8—0

శ్రీ

# కృతి సమర్పణము




ఇయ్యది

ఉదారస్వభావులును, కరుణాతరంగితాంతరంగులును,

విద్వత్పరిపోషకులును, సద్గుణగరిష్ఠులును,

శౌర్యధుర్యులును, క్షమాశీలురును,

నర్సరావుపేట సంస్థానాధీశ్వరులును

అగు

శ్రీమన్మహారాజరాజశ్రీ శ్రీరాజా

మల్రాజు వేంకటనృసింహారావు బహద్దర్

జమీన్‌దారు సర్ దేశముఖు మన్నేవారు

పరగణే బెల్లంకొండ వ వినుకొండ తాలూకే రాచూరు వ కడలి

సైదాపూరు సర్కారు మృత్తుజాన్నగర్ వ ముస్తఫాన్నగర్ వ

రాజమహేంద్రవరము వ నెల్లూరు గారికి

అభ్యుదయ పరంపరాభివృద్ధియగునట్లు

కృతి యీయఁబడినది.

వాణీ ముద్రాక్షరశాల, బెజవాడ.

# పీఠిక

—:o:—

కవులకుఁ బీఠికలు వ్రాసుకొను టాచారమై పోయినది.

మా కవితాలతిక నేఁటికి తొలిమొగ్గఁ దొడిగినది. నిరుపమ చమత్కారకల్పనానల్పశిల్పిశిరోమణి యగు శ్రీరామభద్రదీక్షితుని జానకీపరిణయ నాటకమే దీని ప్రాతిపదికము.

యత్నమా ప్రథమము. పూనిన పనియా తలకు మించినది. "పిల్లకాకి కేమి తెలియు నుండేలుదెబ్బ?" పెద్దలచాటువార మగుటచే మొండిధైర్యము నవలంబించితిమి. గురుచరణరజఃప్రభావ మెట్లో దీనిని ముగింపించినది ఇందేమేని గుణరత్నము లున్నచో నవి సహృదయుల పాలు. దోసములు మా పాలు.

మా యీ బాల్యచాపల్యమును సైతము ప్రోత్సాహదోహదమునఁ బెంపొందించిన పిన్నపెద్దలకుఁ గృతజ్ఞుల మనవలదా?

శ్రీ వేంకట పార్థసారథి కవులు.

—:*(o)*:—

# ఈ నాటకమున వచ్చు పాత్రలు

——:(o):——

## పురుషులు

రాముఁడు—(కథానాయకుఁడు)
లక్ష్మణుఁడు
భరతుఁడు
శత్రుఘ్నుఁడు
జనకుఁడు
శతానందుఁడు
విశ్వామిత్రుఁడు
పింగళుఁడు—రామునిమిత్రుఁడు
కాశ్యపుఁడు—
విశ్వామిత్రునిశిష్యుఁడు
రావణుఁడు
సారణుఁడు } రావణుని
విద్యుజ్జిహ్వుఁడు } యనుచరులు
మారీచుఁడు

కరాళుఁడు—
మారీచునిఅనుచరుఁడు
విరాధుఁడు
మహాపార్శ్వుఁడు—
రావణుని నర్మసచివుఁడు
సంపాతి—విభీషణుని మంత్రి
గంధర్వుఁడు
జటాయువు
కబంధుఁడు
హనుమంతుఁడు
సుగ్రీవుఁడు
వాలి
శుకుఁడు } రావణునిసేవకులు
శార్దూలుఁడు }

(సమయానుకూలముగా ప్రతీహారి మొదలగువారు వత్తురు)

## స్త్రీలు

సీత—(కథానాయిక)
సుచరిత } చెలికత్తెలు
శీలవతి }
అహల్య
ఊర్మిళ
మాండవి

శ్రుతకీర్తి
శూర్పణఖ
అనల
రాక్షసి
ఒకచెలికత్తె

# విచిత్రరాఘవము.

## నాంది

అనువగు నైగమాంతవచనాసవ మానఁగనో? వ్రజాంగనా
జనకుచయుగ్మచందనరజమ్ముల నూడ్వనొ? నాఁగఁ బిల్లఁగ్రో
విని విని చుట్టుఁగ్రమ్ముకొని వేడుక నావులు నాకుచుండఁగాఁ
దనరు నళీకబాలకు పదమ్ములు మీకు శుభమ్ము లీవుతన్.

సూత్ర:—(ప్రవేశించి) నాటకావలోకన కుతూహలమ్మునఁ బూజ్యులగు వీరెల్లరు నిచ్చట గుమికూడి యున్నారు. ఈ సమయమునఁ గాక మఱియెప్పుడు పేరు వచ్చును?

గీ॥ అర్థము, పదంబు, రచన షష్టాష్టకములు
గాక యొకదాని నొక్కటి కైవసంబు
చేసికొను రీతిఁ జెప్పక చెప్ప నట్టి
చిత్రమగు నాటకముఁ బ్రదర్శింపవలయు.

కావున మా నటితో నాలోచించెద. (తెరవంకకుఁ జూచి) నటీ! వచ్చెను. రమ్ము.

నటి:—(సంభ్రమముతోఁ బ్రవేశించి) ఏడీ యేడీ??

సూత్ర:—నీ కేమైన వెఱ్ఱియెత్తినదా యేమి? ఈ కారణములేని కంగారెందులకు?

నటి:—ఏమీ యతఁడు రానేలేదా?

సూత్ర:—అతఁ డెవఁడు?

నటి:—మహామాయుఁడు.

సూత్ర:—నీ వేమైనఁ గలఁగనుచున్నావా? విసిగింపక యసలు సంగతి చెప్పుము.

నటి:—మన కమలిని నీ మేనల్లుఁ డగు కలహంసుని వరించియున్నది గదా! ఇప్పుడు మహామాయుఁ డను కుశీలవుఁడు తనమాయచేఁ గలహంసవేషము ధరించి కమలిని నెత్తుకొనిపోవు నఁట! మన యమ్మాయి కోరిక యెట్లు ఫలించునా యని హడావుడి పడుచుండ నింతలో మీ కేక 'వచ్చె'నని వినఁబడినది. నిజముగా నిప్పుడే వచ్చినాఁడేమో యని రొప్పుచుఁ బరుగెత్తుకొనివచ్చితిని.

సూత్ర:—(నవ్వి) ఓసీ పిచ్చిదానా! కమలినీకలహంసుల పెండ్లి సంఘటింపఁజేయుటకు బృహద్భలుఁ డను శైలూషు నిదివఱకే పూఁటకాఁపుగ నియోగించియుంటిమి

గదా! మరల నీ తొందఱ యేల? ఆ మహామాయఁ డశ్చము కలహంసుని వలెనె వేసము వేయుఁ గాక. మన మేనల్లుని విద్యారో యాతనిఁ బట్టి యీయఁ గలదు.

నటి:—అయిన మీ 'వచ్చె'నను మాట కర్థ మేమి?

సూత్ర:—అదృష్టమును గూర్చి మన మింతకుముందు మాటలాడుకొన్న దానినిఁ బట్టి యది యిప్పుడు కలసివచ్చుటచే నీకు సమాధానముగ 'వచ్చె'నంటిని. (సభ్యులనుజూపును)

నటి:—మఱి యే నాటకమును నిశ్చయించితివి?

సూత్ర:—(నవ్వి) ఒక క్షణము ముందు నీ వాడిన నాటకమునే!

నటి:—మీ పరిహాసముల కేమిలెండు. అది యెద్దియో చెప్పరాదా?

సూత్ర:—అప్పుడే మఱపువచ్చినదా విచిత్రరాఘవము?

నటి:—ఏది? మన వెంకటపార్థసారథికవులచే వ్రాయఁబడినదే గాదూ!

సూత్ర:—మొదట తెలియదుగాని కొంచెము 'నూ'యన్న నల్లుకొని పోఁగలవు. ఊఁ! చెప్పు మింకనుఁ దత్కృతినాథుఁడు—

సీ॥ కీర్త్యంగనామణి క్రేఁగంటి చూపుల
నెలమితోఁ దూగుటుయ్యేలల నూప;
భాగ్యకామిని తన బాహువల్లరుల బం
ధించి సౌఖ్యములఁ దేలించుచుండ;
విద్యావిలాసిని వేడ్క మై వలపుటు
ద్యానంబునందు వింతలను జూప;
దానసుందరి తన తారుణ్యసామ్రాజ్య
మునకుఁ బట్టముఁ గట్టి మురియుచుండఁ;
గీ॥ బట్టినది యెల్ల బంగరు ముట్టినయది
ముత్యమునుఁ గాగ నర్సరాట్పురజమీను
దారు మలరాజ వేంకట నారసింహ
రావు బహదరు భూపాలరత్న మలరు.

నటి:—మీరు చెప్పనే చెప్పితిరి గదా! ఇది శ్రీసామ్రాజ్యము. మాకు వారి స్వతీతిలకము మహాసాధ్వి - ఉన్నదని మీ రెఱుంగరా?

సీ॥ ఈ దిన మెవ్వారికేని సాయము సేయఁ
గలనో? లేనో! యంచుఁ గాంచుచుండుఁ;

## ప్రస్తావన.

గాంచి వచ్చినవారిఁ గన్నతల్లియుఁ బోలె
నాదరించి ధనంబు లర్థి నిచ్చు;
నిచ్చియుఁ దగినంత యిచ్చితినో? లేదొ?
యని యిష్టసఖుల నెయ్యమున నడుగు;
నడిగి నేఁటికిఁ జరితార్థత్వమందు పు
ణ్యము గల్గె నంచుఁ బ్రియంబు నెందు;
గీ॥ నీదృశాసమదాతృతాధీనచిత్త
మమర రేపూడిగుడ్డిగూడెముల నేలు
నట్టి సాధ్వి లక్ష్మి వెంకయమ్మరావు
బహదరు జమీనుదారిణి వరలుచుండు.

సూత్ర:—తద్గర్భశుక్తిముక్తాఫలము నెంతని పొగడవచ్చును?

చ॥ అలఘుతరంబుగా నిజకృపామృతవృష్టులచేత నాశ్రితా
వళుల యభీష్టసస్యములు పండి సుభిక్షముగాఁ దళిర్ప ని
ర్మలయశ మందుచుండును గుమారుఁడు వేంకటరామకృష్ణకొం
డల నరపాలమౌళి సుగుణంబుల కెల్లను జన్మభూమియై.

నటి:—ఔను. రత్నము లన్నియు నొక్కచోట. రా ళ్ళొకచోట. వారి కుమార్తె
లిర్వురు మాత్రము? తల్లిదండ్రుల సుగుణముల నన్నిటిని బుణికిపుచ్చుకున్న
వారే?

గీ॥ తనదు సద్గుణలతిక సౌందర్య మాల
వాలముగ నొప్పఁ గీర్తిపుష్పములఁ బూచి
రాజసము. పెల్లిగొల్ప మా రాజ్యలక్ష్మి
తేజరిల్లు రెండవ రతీదేవి యనఁగ.

గీ॥ పుట్టినింటికిఁ దన మాట ముత్తియంబు
మెట్టినింటికిఁ దన పేరు మేల్మి పసిఁడి
గాగ దీనుల కొంగుబంగార మగుచు
మహిమఁ గనె. మా యలర్మేలు మంగమాంబ.

సూత్ర:—ఇఁక నేమి? అన్నియు నమకూడినవి. నీ యంగీకారమే యవశిష్టము.

నటి:—ఏమో? నేఁడు నే నాడఁ దలఁచుకొనలేదు. పరీక్షకురాల నయ్యెదను.

# విచిత్ర రాఘవము.

సూత్రి:—మొన్నఁ జూచుచుఁ గూర్చుండు మన "గాదు కాదు, నాకు నాటక మాడ వలెననియున్న" దంటివి. మఱల నిప్పు డిది యొకటియా?

నటి:—మరి న న్నేమి చేయ మనెదరు? ఇది నాటకము తప్పు గాని నా తప్పు గాదు. ఏమైనను మీ మాట కెదురాడి బ్రతుకుటకూడనా?

సూత్ర:—ఆఁ! అట్లు దారికి రమ్ము. ఇపుడు స్త్రీసామ్రాజ్య మేమైనదో? దాని నటుంచుము.

చ॥ పరిషదమా బుధాకర మహాకృతిక ర్తకు లిక్కవీశ్వరుల్;
నరపతులందు మేటి కృతినాథుఁడు; వృత్తము రామచంద్రస
చ్చరితము; ఇంక ముఖ్యమగు సంగతి నీవు ప్రసన్నవైతి వీ
వరుసగ నన్నియుం గలిసివచ్చెను నాదగు భాగ్యరేఖచేఁ.

కావున నీ వసంతఋతువునుఁగూర్చి యొక్కసారి గాన మొనరింపుము.

నటి:—

గీ॥ సొగసి రతికేళి సడి యేమి ముగుదతనమొ?
చెలులు వాతాయనాగతశిశిరపవను
సేవఁ జేతురు తమ చిఱుచెమటముత్తి
యముల దొంగిలు టెఱుఁగ రేమనఁగవచ్చు?

మరియు—(అర్థోక్తిలో భయము నటించును.)

సూత్ర:—నీ గానామృతముచే నీ సభాసదు లందఱుఁ జిత్తరువు లైరి. గర్వింపఁదగిన యీ సమయమున భయమునకుఁ జో టొసంగెద వేల?

నటి:—చూచుటలేదా? ఆ రాక్షసుఁడిటే వచ్చుచున్నాఁడు. ఎట్లుభయపడకుందును?

సూత్ర:—సఖీ! భయపడకుము. భయపడకుము. రావణుని యనుచరుఁ డగు సారణుని భూమికధరించి మాబావ రంగస్థలమునఁ బ్రవేశించుచున్నాఁడు. మనము నన ంతరకరణీయములకై సంసిద్ధుల మగుదము రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.



శ్రీరస్తు.

# విచిత్రరాఘవము

## ప్రథమాంకము.

[దృశ్యము : ఒక రాజమార్గము. అంతట సారణుఁడు ప్రవేశించును.]

సార:—మిథిలా వృత్తాంతములఁ దెలిసికొనుటకేగిన శుకుఁ డేలకో తామసించెను. అతఁడు రానిదే నేను వెళ్ళి ప్రయోజన మేమి? (పరిక్రమించును.)

శుక:—(ప్రవేశించి) ఓహో! సారణుఁడా?

సార:—మిత్రమా! నూరేండ్లు. అనుకొనుచుండఁగనే వచ్చితివి.

శుక:—దాని కేమి గాని విశేషము లేమి?

సార:—ఏమైన నున్న నీవే చెప్పవలయును.

శుక:—అది యొక గాథ, సరే కాని నీ వెచటికో ప్రయాణము కట్టినట్లున్నదీ?

సార:—జగదేకసుందరి యగు సీతను దనకిచ్చి పెండ్లిచేయవలసినదిగా జనకు నడిగి రమ్మని మన మహారాజుగారి యాజ్ఞ. అందుచే మిథిలకుఁ బోవుచున్నాను.

శుక:—తక్కిన దేవతాస్త్రీలను బలె సీతను బలాత్కారముగ నెత్తుకొని వచ్చుటకు మన మహారాజున కడ్డుపడుచున్నది శైవాభిమానమే గదా?

సార:—కావచ్చును.

శుక:—కాని,

చ॥ అవనిజ రాముని న్వలచె నా జనకుండు దశాస్యు భీతిచే
నవు ననఁ గా దనం బెదవి యాడక చల్లఁగ గోడ మీఁది పి
ల్లివలె నటించె నంత నవలీలగఁ దాఁ బ్రతిసృష్టి సేయు ప్రా
భవము గలట్టి కౌశికుఁడు వారికిఁ దోడ్పడెఁ బూఁటకాఁపుగా.

సార:—నేరెయు మూడయు నుండఁగా గుంజ గింజకున్నదన్నట్లు మధ్యనీతఁ డెవ్వఁడు?

శుక:—ఇప్పు డీ మంత్రాంగమున కంతటికి నీతఁడే సూత్రధారి.

సార:—[వెడనవ్వుతో] ఏమీ కాలవైపరీత్యము? మన మహారాజు నెడ ఋజువృత్తియు జనకునెడఁ గౌటిల్యమునా?

శుక:—ఇప్పు డమ్మునిముచ్చు యజ్ఞమను మిషచే దశరథునిఁ గుటుంబ సహితముగఁ దీసుకొనివచ్చుట కయోధ్యకు వెళ్ళెను. జనకుఁడునుఁ దన తమ్ముఁడగు కుశధ్వజుని మిథిలలోనుండ నియమించి యజ్ఞముఁ జూచుటకను నెపమున జానకితోఁగూడఁ గాశికాశ్రమముఁ జేరెను.

సార:—సరే! ఇఁక జెప్పనదేమి? ఈమిషచే సీతారాముల పాణిగ్రహణము నిర్వర్తింపఁ బడునన్నమాట. జనకుఁడు వట్టి వెఱ్ఱివాఁడుగ నున్నాఁడే! మనమహారాజంత వాఁడు తనంతట వచ్చి పిల్ల నడుగుచుండ నెదురాడఁ దగునా?

శుక:—ఐనను జనకుఁడు తన ముద్దులకుమార్తె కోరిక కాదనునా?

సార:—ఔను. త్రాగలేని పిల్లి బోర్లబోసికొనునఁట! సీతమాత్రము చిన్నదా? చిఱుకదా? ఎఱుగఁదా? మనమహారాజు వైభవము. (నిట్టూర్చి) ఎట్లైననేమి? ముందుగా జానకిచూడ్కులు రామునినుండి తప్పించి మన మహారాజు మీఁదికి మఱలింపవలయును.

శుక:—ఐన నుపాయ మేమి?

సార:—[ఆలోచించి సంతోషముతో] దాని కొక్కటే యుపాయ మున్నది.

చ॥ చలమున రామవేషమున జానకి నెట్టులో పెండ్లియాడఁగా
వలె మన రాజు పై నతని వైభవముం గని రోజురోజు కా
పోలఁతియె రామునిన్ మఱచిపోయి తనంతన రాక్షసేశు పై
నెలకొనఁజేయుఁ బ్రేమమును నెమ్మది నెమ్మది నందుఁ దండ్రియున్.

నేను లక్ష్మణవేషమును, విద్యుజ్జిహ్వుఁడు విశ్వామిత్రవేషమును వేయుదుము. ఇఁక నడ్డంకి యేమి? వెంటనే జనకుఁడు తనకూఁతునిచ్చి పెండ్లిసేయఁగలఁడు.

శుక:—బాగుబాగు! చక్కని యుపాయము!! కాని యయోధ్యకువెళ్ళిన యా క్షత్రియబ్రాహ్మణుని యాగమనమును ముందుగా నిరోధింపవలయును.

సార:—లెస్సఁ బల్కితివి. మనలో తాటకతప్ప నీ కార్యమును సాధింపఁగల మేటి యెవరు? కర్మము చాలక యొకవేళఁ బట్టువడినను స్త్రీ కావున వారు చంపక విడచిపుత్తురు.

శుక:—అయ్యో! ఇంతకుముందే చూచితివే? విశ్వామిత్రుని కొక బాదరాయణసంబంధియు శైవుఁడు నగు పరశురాముని ప్రార్థన నంగీకరించి మన మహారాజు పంపఁగా యజ్ఞవిఘ్నము చేయవల దని పుత్రుని మారీచుని హెచ్చరించుట కామె వెళ్లుచుండె నఁట!

సార:—అహా! ఈ గోచిపాతరాయుఁడు సామాన్యుఁడు కాఁడు. తన వసుల కడ్డురా కుండ మహారాజును ముందే బుట్టలో పెట్టుకున్నాఁడు. (ఆలోచించి) ఐనను మించినదేమి? నీవు త్వరితముగ నేగి ఈ విషయ మామె చెవిని వేసి కార్యసాధనకుఁ గడఁగుము. నేనును మహారాజును బయలుదేరదీయుదును.

[ఇరువురు నిష్క్రమింతురు.]

ఇది విష్కంభము.

---

దృశ్యము : కౌశికాశ్రమోపవనము.

[అంతట విద్యుజ్జిహ్వా సారణులతో రావణుఁడు ప్రవేశించును.]

రావ:—సీత నా రాక్షసరూపము సేవగించుకొను నని నేను నరవేషము వేయవలెనా?

మ॥ ఎటుఁగం జాలియుఁ దీసివేసినటు లిట్లేలా వచింపన్? సురా
సుర సందోహ శిరః కిరీట ఘటి తాస్తోక ప్రభా భృన్మణీ
కర నీరాజిత పాదపంకజుఁడ, వీక్షామాత్ర నిర్భిన్నహృ
త్వరిపంథి ప్రబలుండ నా భుజబలావష్టంభ మల్పం బొకో.

విద్యు:—దేవా! తమ బలంబెఱుంగక కాదు. ఎదిరికి జంకియుఁ గాదు. పిచ్చుకపై బ్రహ్మాస్త్రము మేల యని.

సార:—బాగుగనే యున్నది. పెండ్లియైనఁగాని పిచ్చికుదురదు. పిచ్చికుదిరినఁగాని పెండ్లికాదు.

చ॥ నలుగురి నోళ్ళలోఁ బడుదునా యనియా? తమ కింత చింత, యిం
దుల మడిఁ గట్టుకొన్న విబుధుం డెవఁ డీ మన దారి పూర్వమే
యల దమయంతి పెండ్లి సమయమ్మున దిక్పతిపాళి చేత బల్
నలుగుడు సెంది యున్నది సలక్షణమై యిఁక వేయు నేటికిన్.

విద్యు:—(ఒడలు పులకింపఁ దనలో) దిక్పాలురకు దమయంతివలె మహారాజునకును జానకి యలభ్యయే యగునా యేమి?

రావ:—సారణా! నీ వెన్ని చెప్పినను సరే కాని మానంబుఁ బోనాడి యపకీర్తిపాలు కాఁజాలను. నేనిప్పుడ చని మదీయనిర్వక్రపరాక్రమంబున నజ్జనకుని గర్వంబు సర్వంబు ఖర్వంబుఁ గావించి చెచ్చెర నమ్మచ్చెకంటిం దెచ్చికొనియెద. ఘునినో—రామునినో—యెవనిని శరణు వేఁడుకొనునో చూచెద.

(పోఁబోవును.)

సార:—(నిరోధించి) దేవా!

గీ॥ జగతి విధి బీజము వివేక జలము వలనఁ
జిలువలకుఁ బల్వలై కార్య ఫలము నిచ్చు
నంతె కాని పిడ్డునకు బియ్యమున కొక్క
మంత్రమే యందు రెట్లు? నా మాట వినుఁడు.

విద్యు:—వినను మఱియొక సంగతి.

ఉ॥ కోరికలూర రంభ నలకూబరుఁ గూడఁగ నేగుచో బలా
త్కారము సేయ నాపెయు నిఁకం బర భామల నంటఁ జూచినన్
ఘోరు సెలంగ నీదు శిరముల్ పది పక్కన నూరు వ్రయ్యలై
తీరు నటంచు శాపమిడదే? యది జ్ఞప్తికిఁ దప్పిపోయెనే.

సార:—ఔ నది విచారణీయమే!

రావ:—(బొమముడిపాటుతో) ఎట్లయిననేమి? రావణుఁడు వేసము వేయును. నరేనా? (లజ్జతో) చూడుఁడు. దుర్బలునివలెఁ జోరవృత్తి నవలంబించిన యీ మానహీనుని—దశాననునిఁ గని యివ్విహంగములు సైత మపహసించుచున్నవి.

సార:—అది సరి కాదు. కాఁబోవు జానకీ రావణుల వివాహమహోత్సవమున కాంగికముగ శుకశారికలమందానందనాందీనినాదంబుల సందడించుచున్నారు.

[తెరలో]

చిత్రలేఖన సంభారములఁ దెచ్చుటకుఁ బ్రియసఖి శీలవతియు, శిశిరోపచారములకై నళినీపత్రములఁ గొనిరా సుచరితయుఁ బోయిన యీసందుఁ గనిపెట్టి మన్మథుఁ డొంటరిదాననగు నాపైఁ దన చావుతెలివిఁ జూపుచున్నాఁడు. అబ్బా! ఇఁక నేమి సేయుదును?

రావ:—(వినుట నటించి)

గీ॥ పసిక క్రొమ్మావి చివురుల యసరు మెసవి
సరళి గొంతెత్తి పంచమస్వరము గదుర
నలరువిలుకాని జయగీతికలను బాడ
మొదలువెట్టెడుఁ గోయిల ముద్దరాలు.

సార:—మహారాజా! అవ్యక్తమధురమధురంబగు నియ్యది కోకిలస్వనంబై యుండును. శారికావ్యాహారము కాఁబోవు!

[మరలఁ దెరలో]

దేవా! కుసుమాయుధ! ఒక్కసారిమైన చిత్రలిఖితుఁడగు మనోహరునిఁ గన్నుల కఱవుదీరఁ జూడనిమ్ము. తరువాత నీయిచ్ఛవచ్చినట్లొనర్చుదుగాని—

రావ:—(విని) ఇచ్చట నెవరో విరహాతురవశయగు నొక తపస్విని విలపించుచున్నది. (నలువంకలు బరికింతురు.)

సార:—అట్లు విలపించిన యామె యెందును గానరాదే?

రావ:—(ఆశ్చర్యముతో) ఇచ్చట నెవరునులేరు. ఆహా! ఇది చాల నద్భుతముగా నున్నదే?

[మరలఁ దెరలో]

గీ॥ అల్లనాఁడొక్క పసిముద్దు నప్పుఁగొంటి
విచ్చకము లాడి యది జ్ఞప్తి దెచ్చుకొనుము
వలపు జెలికాఁడ! పోనిమ్ము వడ్డి నడుగ
నసలయినఁ దీర్చుకొను మంటి నదియు వినవ?

సార:—ఓహో! మఱల నీయాకాశవంశాంగము బయలుదేరినదే?

రావ:—ఏమీ మబ్బులేని సుధావర్షము?

విద్యు:—తాపసుల యాశ్రమవ్యాపారము లచింత్యములు నజ్ఞేయములుఁ గదా!

[మరలఁ దెరలో]

ఇఁక గతి యేమి? విషమా?—

రావ:—మన కదృశ్య యగు నొకానొక యుత్కంఠిత విలపించుచున్న దనుట నిక్కము.

విద్యు:—(ముందునకుఁ జూచి తొందఱతో) సారణా! ఆమె యెవ్వతెయో యిటే వచ్చుచున్నది. మన మిక్కడనున్న నపాయము కలుగవచ్చును. కావున నీ పొదరింటిలోని కేగుదము రండు.

సార:—ఓయీ! వెఱ్ఱివాఁడా! మనము తిరస్కరిణీవిద్యచేఁ దిరోహితులమై యుంటిమి గదా! ఆ విద్యాప్రభావ మేమనుకొంటివి? ఇతరులు మనకుఁ గనుపట్టెదరు గాని మన మితరులకుఁ గనుపింపము. అట్లే మాటలును.

[సుచరిత తామరాకులతోఁ బ్రవేశించును.]

సుచ:—నెచ్చెలీ! కుడిచి కూర్చుండక యేల యమంగళము లాడుకొందువు?

[అంతఁ గిసలయశయనోపవిష్టయగు సీత ప్రవేశించును.]

సీత:—మనోహర ముఖచంద్ర దర్శన సుఖమా? (మూర్ఛిల్లును.)

సుచ:—చెలీ! ఊఱడిల్లు మూఱడిల్లుము. (తామరాకుచే విసరును)

రావ:—ఈ సుందరినిఁ గనుఁగొను భాగ్యము నాకు లేదాయెఁ గదా!

సార:—చెలికత్తెమాత్రము కాన్పించుచున్నది. ఆమె కనఁబడుటలేదు. ఇది మఱియు వింతగా నున్నది.

సుచ:—పాపము! ఈమె సంతాప మంతకంతకు మితిమీఱుచున్నది. ఈచందన పల్లవ రసము నీమెపైఁ జిలుకరించెద. (అట్లు చేయును.)

రావ:—

గీ॥ కడఁగి విరహాగ్ని మొదలంటఁ గాల్చుచుండఁ
దదుపశాంతికిన్ విరుద్ధముగఁ దనదు
ప్రాణముల గడ్డిపోచల వలె నొనర్చె
నద్దిరా! యీమె యెంతటి ముద్దరాలు!

సుచ:—సఖీ! ఈ చందనరస నిషేకము నీకు హాళిఁగొలుపఁగలదు.

సీత:—(ఇంచుక యూఱడిల్లి) ఎంతకాల మిట్లు సఖుల నాయాసపెట్టుదునో గదా?

సుచ:—సఖీ! చింతింపకుము. నీ మనోహరుఁడు చేపు తప్పక వచ్చును.

సార: —ఈమె మనోహరుఁ డెవరో?

రావ —ఎవఁడో పెట్టిపుట్టినవాఁడు.

సీత:—నెచ్చెలీ! ఏల యీవెఱ్ఱిమాటలు? నేఁడొకటి జీవించినఁగదా? రేపటిమాట.

సుచ:—చిత్రలిఖితుఁడగు ప్రియునిఁ జూచుకొని నేఁ డెట్లో కన్నులుమూసికొని వెళ్ళింపుము.

[ అంతటఁ జిత్రలేఖన సంభారములతో శీలవతి ప్రవేశించును. ]

శీల:—చెలీ! ఇదిగో! చిత్రఫలకము. ఇవే లేఖనోపకరణములు. (ఇచ్చును.)

సుచ:—జానకీ! ఇంచుక మనస్సును చిక్కఁబట్టి చిత్రమును వ్రాయుము.

సీత: —(చిత్రఫలకము గ్రహించి గాత్రస్తంభ మభినయించును.)

శీల: —చెలీ! ఏమాలోచించు చున్నావు?

సుచ:—శీలవతీ! ఎఱుఁగన ట్లడిగెద వేమి? స్వప్నమున మన్మథునిచేఁ జూపఁబడిన యా మహానుభావునిఁ గూర్చియే.

సార:—మహారాజా! అదృష్టవంతుఁడవు. ముల్లోకములందును నీవు దక్క వేఱ మహానుభావుఁ డెవరు?

రావ:—నాకు నట్లే తోఁచుచున్నది. ఇంకనుఁ బరికింతము.

సీత:—(ఎట్లో కొంతవ్రాసి) సుచరితా! అందనిమ్రానిపండ్లకై యఱ్ఱులుసాచినశోభ మేమని లజ్జించుచున్నాను. (కన్నీరు విడచును.)

సుచ:—సీతా! చింతింపకుము. అతఁడు మనకు సులభసాధ్యుఁడేగదా!

సీత:—(కన్నీరు తుడుచుకొని మరల లిఖించును.)

సుచ:—(జనాంతికముగా) శీలవతీ! అతనియెడ నీమెకుఁ గల ప్రేమ యింతంతయని చెప్పఁదరముకానిది. చూడుము. వలపుచే లేఁజెక్కులు జాజులగ్రుమ్మరింప నతని రూపరేఖలఁ దలంచుకొని క్రమముగాఁ దన చివురుఁ వేళులు కంపింపఁ జిత్రము రచించుచున్నది.

శీల:—(జనాంతికముగా) అచ్చముఁ దాను కలలోఁ జూచినవిధమున వ్రాయవలె నని యీమె యభిలాష.

రావ:—[తనలో] హృదయమా! ఏల యీ యస్థానచాపల్యము?

సీత:—[చిత్రముఁ బూర్తిఁజేసి యందలి నాయకునిఁ గని ప్రేమతో]

మ॥ కలలోఁ గన్పడి వింతవింతకళలం గల్పించి నా వాలుజూ
పులలో నుయ్యెల లూఁగి నా వలపుసొమ్ముం గొల్లఁగా దోచి యీ
కలతోఁబాటుగఁ బారిపోయితివి దొంగా! చిక్కినా విందుఁ; గూ
కలువేయింతును జూడు నీ చిలిపిపోకల్ చెప్పి యమ్మారుతోఁ.

మనోహరా! ఏదిరియో దారితప్పి వచ్చినట్లున్నది. (అర్థోక్తిలోఁ దనలో) చిత్రగతుఁడగు నాథునిఁగని యెదుటనున్న వానివలె నుపాలంభింప మొదలిడితిని ? ఇస్ ఎంతటి వెలతనము? (సిగ్గుపడును.)

రావ:—[చిత్రమునుఁ జూచి తనలో] ఈచిత్ర మన్యథా వర్తించుచున్న ట్లున్నదే?

శీల:—[నవ్వి] జానకీ! నోటిలోనిమాట నోటిలోనే మ్రింగివేసితివి?

సీత:—[సిగ్గుతో] ఏమియులేదు. చిత్రమును ముగించితిని.

[సుచరితా శీలవతులు చిత్రమును దీసికొని చూతురు.]

శీల:—సుచరితా! చిత్రగతుఁడగు నీతని యాకృతివలెనే యితనియం దీమెకుఁ గల యభినివేశమును నుచితమని తలంతును.

సుచ:—ఇంతటి మధురమూర్తి దొరికినపిదప జానకికి మనము కనఁబడుదుమా శీలవతీ!

సార:—[చూచి యాశ్చర్యముతో]

గీ॥ కల జగంబుల రూపరేఖావిలాస
సుభగు లగు వారి నెందఱఁ జూడలేదు?
పురుషులను సైత మీగతి మోహపెట్టు
నిట్టి రూపంబుఁ జూడలే దింతవఱకు.

రావ:—[తనలో]

గీ॥ నల్లగల్వలకునుఁ దమ నలఁదనము
వడ్డికిచ్చెదు నీ తనుప్రభలు శాత్ర

పులకునై నఁ గన్నులపండువుగఁ దనర్చి
శేముషీయుక్తిఁ జెప్పక చెప్పుచుండె.

[ప్రకాశముగా] విద్యుజ్జిహ్వ! చిత్రమునుఁ జూచితివా?

విద్యు:—చూచితిని.

సీ॥ చెలు వెలయించుఁ గ్రొందళుకు మీసపు మొల్క—
నవనవాంకుర యౌవనంబుఁ దెలుపఁ
జెంపకుఁ జేరడై చెలువారు గండోయి
వితత మహానుభావతను జాటఁ
జిఱుత జన్నిదమునఁ జెన్నారు నజినంబు
వడుక పెండ్లికొడుకు బెడఁగుఁ జూపఁ
మోకాళ్ల నంటఁగాఁ బోవు హస్తంబులు
ఘనత ధీరోదాత్తతను వచింప
గీ॥ ధనువుఁ జేఁబూని నిజశౌరతావిశేష
ముట్టివడ రాజసం బెల్ల నొకటఁ గఱఁగి
పోఁతపోసిన చందాన ముద్దుఁగొలువు
నితనిఁ గనుగొన్న కొలఁదినిఁ గుతుకమొదవు.

సీత:—సుచరితా! చిత్రముం జూచితివి గదా?

సుచ:—(నవ్వి) నేను చూచిన లాభమేమి? నీ మనోహరుఁడు చూచినచో నీచేతకుఁ బారితోషికముగా రత్నకంకణములఁ దొడుగును.

రావ: —సుచరిత నిజము చెప్పినది.

శిల:—సుచరితా! భర్తయొసంగునను టేమోగాని జానకీ రక్షణార్థము కౌశికుఁడొసంగిన రాక్షసాంధంకరణమణిఘటితకటకముల నామెకుముందుగా నీవే తొడిగితివిగదా?

(రావణసారణ విద్యుజ్జిహ్వలు విని యొండొరుల మొగములఁ జూచుకొందురు.)

విద్యు:—వినఁదగినది వింటిమి. కనఁదగినది కంటిమి. ఇఁకనేమి? మన కదృశ్యయగు నీమె సీత. చిత్రలిఖితుఁడగు నతఁడు రాముఁడు.

రావ:—ఏమీ? ఇతఁడేనా వైదేహీప్రణయావతార దుర్లలితుఁడగు రామహతకుఁడు! (రోషముతో) ఓరీ! దురాత్మా!

ఉ॥ "ఆ చపలాక్షి సీత ప్రణయాపణ మందున విల్చి యప్పుడే
పూఁచిన తళ్కుగందొవల ముద్దుగ నన్ను బహూకరించు, నే

దోఁచెదఁ దన్మనం"బనుచు ధూర్తత నుబ్బుచునుంటి వేమొ? మా
రీచఫణీంద్ర వి.ప్పుడె హారీ! యనిపించును నిన్ను దారిలో.

సార:—మహారాజా! ఆకౌశికుని యవినయమునుఁ జూడుము. ఈమె కీ కంకణముల నిచ్చి రాక్షసుల కదృశ్యయగున ట్లొనర్చినాఁడు. అందుచే నామె కనఁబడు చున్నను మనము చూడఁజాలకున్నాము.

విద్యు:—ఓ నట్లే! ఆ క్షత్రియ బ్రాహ్మణుఁడు కడు నేర్పరి.

రావ:—[క్రోధముతో] ఓరోరీ! కౌశికాపశద!

సీ॥ సృష్టికిం బ్రతిసృష్టి సేయఁజాలితిఁగాని
మారీచు నెదిరించి మనుట కల్ల;
రంభా విజృంభ ణారంభ మాపితిగాని
తాటక నాఁగుట బూటకంబు;
పూని త్రిశంకునిఁ బ్రోవఁ గల్గితిగాని
యల రాఘవునిఁ గాచు టది పలుకక్క;
బ్రహ్మ విజ్ఞానంబుఁ బడయ నోఁచితిగాని
యస్మత్ప్రయోగమ్ము నరయు టెటిది;
ఆ. వె. నిన్నుఁ గట్టఁ ద్రాడు నీవయి కొనితెచ్చు
కొంటి వేమనందు తంటమాట
లాడి నాకు విప్రియంబునుఁ గల్పించి
చావ నిశ్చయించినావె చెపుమ!

సార:—ఆఁ! ఏమంటిరి? చావనిశ్చయించుకొనుట కతఁ డెవఁడు? చచ్చినట్లే.

రావ:—(ఉత్కంఠతో) ఓయీ సారణా! అది యట్లుండనిమ్ము. జానకిం గనుఁగొన నుపాయ మాలోచింపుము.

సార:—ఆలోచించియే యుంటిని.

రావ:—(ఉత్సాహముతో) ఎట్లు?

సార:—(చెవిలోఁ జెప్పును.)

రావ:—లెస్సఁగ నుపక్రమించితివి. కటకములఁ దెచ్చుటకై యిప్పుడే యాయోధ్యక మునీశ్వరుఁడవు కమ్ము.

సార:—చిత్తము. (సారణుఁడు మునిగా మారును.)

ముని:—[పరిక్రమించి యాయాసము నటించి] ఎవరక్కడ! అయోధ్యనుండి కడు

డప్పువచ్చుటచేతఁ గాళ్ళు పడిపోయినవి. అబ్బా! (క్రిందఁ గూలఁబడును.) ఇట
న న్నాదరించు దయామయు లెవ్వరును లేరా? (మూర్ఛిల్లును.)

సీత:—(సంభ్రమముతో) సుచరితా! అయోధ్యనుండి వచ్చినవాఁడ ననుచున్నాఁడు. ఆతనిం బరామర్శింపుము.

సుచ:—(మునిని డగ్గఱించి) విప్రోత్తమా! విశ్రమింపుము. (తామరాకుతో విసరును.)

ముని:—(కన్నులు తెరచి) అకారణ కారుణికురాలవగు నీచే బ్రతికింపఁబడితిని.

సుచ:—(తనలో) దైవవశమున నీ పాఱుఁడు బ్రతికినాఁడు. (ప్రకా) స్వామీ! తా మెవ్వరు? ఎచ్చటి కేగుచున్నారు?

ముని:—కలఁడుగదా, దాశరథి!

సీత:—(సంభ్రమముతో) అతని కేమో!

రావ:—(అసూయతో) తాటకా మారీచు లాతని మటుమాయము చేసిరి.

సుచ:—ఎఱుఁగుదు మాతనిని—

ముని:—(వేదన నభినయించి) అయ్యో! నా నాలుక యెండిపోవుచున్నది.

రావ:—(నవ్వి) వివక్షి కథా కథనంబునన్నా?

సీత:—(ఆవేగముతో) ఈతఁ డప్రియము చెప్పఁదలఁచిన ట్లున్నది.

శీల:—సుచరితా! ఇతనికిఁ ద్రాగుటకుఁ గొంచెము మంచినీ రిమ్ము. తక్కినది విందము.

సుచ:—(దొన్నతో నీరుఁ దెచ్చి యీయఁ బోవును.)

ముని:—అమ్మలారా! ఆఁడువాం డ్రిచ్చు నీటినిఁ ద్రాగను.

విద్యు:—దేవా! సారణుని కౌశల్యముఁ జూడుఁడు.

సీత:—(కన్నీటితో) నిజముగ నీ బ్రాహ్మణుఁడు విపన్నుఁడై జలపానవిముఖుఁ డగుచున్నాఁడు! నాథున కెద్దియేని నాపద వాటిల్లియుండదు గదా?

ముని:—(తనలో) కేవల మాతనికే కాదు. తదభిమానియగు కౌశికునకును. (ప్రకా) సుందరులారా! తొందఱపడవలదు.

సుచ:—మునీంద్రా! ఇంచుక యుపశమిల్లి పై సంగతిఁ జెప్పుము.

సీత:—ఇపుడు నా హృదయ మగ్నియందుఁగాని, యమృతమునందుఁగాని పడఁబోవుచున్నది.

ముని:—నిజముగా నా యీ స్థితిని జూచినచో నా తలిదండ్రులునుఁ బ్రియపుత్రులు నెంతగ దుఃఖింతురో!

విద్యు:— (సోపహాసముగా) వారే గాదు. విరుద్ధవేషగ్రహణముచే రాక్షసజాతి యంతయు.

సీత:—చెలీ! ఊఱకుండక చెట్టుఁ గొట్టి పైన వేసికొంటివి.

శీల:—నిజముగా నీతఁడు రాక్షసుఁడే. ప్రియసఖ యావేగ మతిశయపఱచి తరువాత వార్తఁ జెప్పకున్నాఁడు.

ముని:—(భయముతోఁ దనలో) ఈ తొత్తుకూఁతురు నన్నెఱింగెనా యేమి! (విమర్శించి) అది యసంభవము. (ప్రకా) నే నా రామభద్రుని ప్రియసఖుఁడను.

రావ:—(నవ్వి) సందేహమేమి? అతనిఁ జంపుటకు ముందంజ వేసినవాఁడవు గనుక!

సీత:—ఇంతమాత్రముచే వ్యధితనగు నా కేమి యాటంట కలుగును?

సుశ:—మునీంద్రా! చెప్పుము. మి మ్మిటకుఁ దోడ్తెచ్చిన పని యేది?

ముని:—అమ్మలారా! మీ కంతయుఁ బాన గ్రుచ్చినటు లెఱుక పఱచెద గాని మీరు దశగ్రీవపక్షపాతినులు కారుగదా?

విద్యు:—దేవా! సారణుని టక్కులు వారి నెట్లాడించుచున్నవో చూచితిరా!

సీత:—(తనలో) ఇట్లనుటచేఁ నీతఁడు నిజముగాఁ బ్రియుని ప్రాణమిత్త్రుఁడే కావచ్చును.

శీల:—సుచరితా! ఈ దశగ్రీవనామకుఁ డెవ్వఁడు?

రావ:—ఓసీ తొత్తు కూఁతురా! త్రైలోక్య విజయుని నన్నెఱుంగవా?

ముని:—

మ॥ హరశైలం బొక గడ్డిపోచగ నితం డాడించిన ట్లాడె; నా
హరిచక్రంబును వీని గాయపడఁజేయ న్మొక్కవోయెన్; సురా
సురు లెల్లా రడిగాపులై కొలుతు రీ శూరోత్తమున్; రాక్షసే
శ్వరు గాథల్ విననట్టివారుఁ గలరే సర్వాంసహామండలిన్.

సీత:—మన కా దుర్మార్గుని గుణములతోఁ బనియేమి. అతఁడు లోక కంటకుఁ డని వాడుక.

రావ:—(ముఖభంగముతో) విద్యుజ్జిహ్వా! విసఁ దగినది వింటిమి.

విద్యు:—కనుకనే యీమెను వశపఱచుకొనుటకు రామభద్రుని వేషము వేయుట దక్క వేఱొం డుపాయముఁ గనలేకుంటిమి.

రావ:—

ఉ॥ రాముని పాత్ర వేయవలె రావణుఁ డంచును బట్టువట్టి యే
మేమిరొయొ మీరుఁ దోఁచునటు లీగతి నాడుచు నున్నవారిసీ!
కామమునే నడంచుకొనఁ గల్గుదుఁ గా కిటు చోరవృత్తిచే
నా మహనీయజీవితము నవ్వులపా లొనరించు కొందునే?

విద్యు:—(తనలో) వ్యవహారము మఱల మొదటికి వచ్చినది. (ప్రకా) దేవా! ఏల యీ యసమయ వైమనస్యము? మనకు వంచనయే గదా కులధర్మము!

సుచ:—శీలవతీ! ఎఱుఁగనే యెఱుఁగవా? ఆ లంకేశ్వరునిఁ దమ ప్రియ మిత్రునిగ నెన్నుచుందురు గదా మహారాజుగారు.

రావ:—కనుకనే యీ రావణుఁడు జానకిని బలాత్కారముగ నెత్తుకొని పోఁజాలకున్నాఁడు.

శీల:—విప్రోత్తమా! రావణుఁడు జ్ఞప్తికి వచ్చినాఁడు. మే మాతని పక్షము వారము గాము. (నిరూపించుచు) ఈమె జానకి. ఈమెయు నేనును నామె చెలికత్తెలము.

ముని:—(తనలో) ఆహా! ఈమె జానకి యని లెన్సఁగా వట్టి నేలను జూపుచున్నది.

సుచ:—ఇఁక మమ్ము నమ్మి నీవు నీ వృత్తాంతముఁ జెప్ప వచ్చును.

శీల:—ఆర్యా! క్షేమ వార్త నెఱింగించిన పక్షమున మా జానకి తన రత్న కంకణముల నీకుఁ బారితోషికముగ నొసఁగఁ గలదు.

ముని:—(తనలో) నా యీ దొంగవేష మంతయుఁగూడ నందులకే. (ప్రకా) అమ్మలారా! ఏమి చెప్పుదును?

సీత:—(ఆవేగముతో) ఆఁ! ఎట్లు!! మధ్యమలోకాలంకార మస్తమించెనా యేమి? (మూర్ఛిల్లును.)

సఖులు:—హా! జానకీ! నీ ప్రాణమే మా ప్రాణముగా నీసౌఖ్యమే మా సౌఖ్యముగాఁ గంటికిఁ గన్నాకు తెఱంగున ని న్నింతకాల మనువర్తించినందుల కిదియే నా ఫలితము? కడకు మమ్ము విడనాడి యచిరపరిచితుఁ డగు మనోహరు ననుగమించు చుంటివి?

ముని:—ఏల యీ యకాండతాండవము? తుదిముట్ట నాపలుకు లాలింపుఁడు.

సుచ:—నెచ్చెలీ! ఊఱడిల్లు మూఱడిల్లుము. తక్కినదిగూడ విందము.

సీత:—(ఊఱడిల్లి మునివంకకుఁ జూచుచుండును.)

ముని:—ముగ్ధలారా? సంతోషించుటకుమాఱుగా నేల దుఃఖించెదరు? మన్మథమన్మథుం డగు మా రామభద్రుఁడు లక్ష్మణకౌశికులతో నీ పీపాటి కీయెడకుఁ దప్పక వచ్చును.

రావ:—(నవ్వి) ఓయీ! సారణమునీంద్రా! నీవు నబద్ధము లాడు చుంటివా? దశగ్రీవుఁడు సారణవిద్యుజ్జిహ్వులతోడ ననిగదా చెప్పవలసినది.

సుచ:—జానకీ! ఇఁకనేమి? నీరొట్టె విఱిగి నేతిలోఁ బడినది. సంకల్పసిద్ధురాలవమ్మా!

(సీత హర్ష సంభ్రమములతో లేచి సారణునకుఁ గంకణముల నిచ్చును. సీత రాక్షసులకు నైత మగపడును.)!

రావ:—(విస్మయముతో)

చ॥ కలయొకో? కాదు; మేల్కనియెగాదొకొ యుంటిని? మానసంబునన్
గలవర మున్నె? నమ్ముదున? నమ్మకయుందున? కన్నుదోయి నన్
దలపడి మోసపుచ్చదుగదా? యది యెట్లగు? మిన్ను వీడి చం
చలమగు చంచలాలతిక స్థాయిగ నిక్కడ నిల్చె మాయురే!

గీ॥ మాయకంకణములు చూడనీయ వపుడు
నిద్దపు నిగారములు చూడనీయ విపుడు
చూడనప్పుడు మఱియునుఁ జూచినప్పు
డొక్కతీరయ్యె; చక్కని చుక్క యీమె!

[తెరలో]

కౌశికయజ్ఞ దర్శనార్థ మనసూయతోఁగూడ నత్రిమహాముని తదాశ్రమము
నకు దయచేసెను. వారికి నమస్కరించుటకు రావలసినదిగాఁ
గుమారి జానకిని జనకు లాజ్ఞాపించుచున్నారు.

సుచ:—భాగ్యవశమునఁ బ్రియసఖి కుత్తరోత్తర ప్రియంబు గాన్పించు చున్నది.
భగవతి యనసూయ చిరకాలపురంధ్రియుఁ బుణ్యదర్శనియుఁ గదా?

సీత:—(ప్రీతితో) ఔను. పోవుదము రండు. (చెలులతో నిష్క్రమించును.)

రావ:—ఆహా! జానకి కనుచూపు మేఱ దాటి పోయినదే! (విచారించి) విద్యుజ్జిహ్వా!
ఈమె నెట్లన సాధింప వలయును.

విద్యు:—రామవేషము ధరించిన నిది యెంతటిపని?

[ముని యథాప్రకారము సారణుఁడగును.]

సార:—మహర్షు లచింత్యమహిములు గదా?

గీ॥ ఇచ్చె నామెయు నేనును బుచ్చుకొంటి
ననెడు మాటయెగాని యిచ్చినదో? లేదో?
తెలియఁజాల నీ కంకణమ్ముల ధరింప
నా శరీరము నాకె గన్పడకయుండె.

(సమీపించి) దేవా? ఇవే యా కంకణములు. ఇదే యా చిత్రపటము. (ఇచ్చును)

రావ:—(అందుకొని) ఈ చిత్రము నెట్లు సంపాదించితివి?

సార:—దేవా? బంధుజన విలోకన కుతూహలంబున వారేఁగు నా నందడిలో నిది
యక్కడ వితుకఁ బడినది. నేను దీనిని సంగ్రహించుకొని వచ్చితిని.

విద్యు:—రాజేంద్రా! మన సారణుఁ డిప్పుడు కాన్పించు చున్నాఁడు. ఆ కంకణములు దేవర హస్తమం దుండుటచే మీరు కాన్పించుట లేదు.

రావ:—విద్యుజ్జిహ్వా! సీతను విమానమం దుంచి లంకఁ జేరిన పిదప నీ యొద్ద గుప్త పఱచి యుండనిమ్ము. సమయమున కక్కఱకు రావచ్చును.

(విద్యుజ్జిహ్వుఁడు నిష్క్రమించి మరలఁ బ్రవేశించును.)

సార:—దేవా? అభిమత రూప గ్రహణంబునకై తొందరపడుడు.

రావ:—అయ్యది నా కనభిమతంబు యైనను జగన్మంగళదీపిక యగు జానకికై నే నివే కుహనారాముఁడ నగుచున్నాను. మీరును లక్ష్మణకౌశిక వేషముల ధరింపుఁడు.

సార:—
విద్యు:— } చిత్తము.

(ముగ్గురు రామ లక్ష్మణ కౌశిక వేషముల నిలతురు.)

రావ:—మిత్రులారా? ఇఁక నాలస్య మేల?

గీ॥ స్నేహితుఁడ నైన జనకు వంచింప వలయు;
మనుజవేషం బసర్వ మైనను ధరింప
వలయు; నిఁక జానకీ రావణుల వివాహ
మంగళము తేపె జరిగితీరంగవలయు!

కావున జనకునొద్ది కేఁగుదము రండు.

[అందఱు నిష్క్రమింతురు.]

ఇది శ్రీ వెంకట పార్థసారథి కవి ప్రణీతం బయిన విచిత్ర రాఘవమునఁ బ్రథమాంకము.

---

# విచిత్రరాఘవము

## ద్వితీయాంకము

దృశ్యము:—వనములో నొకభాగము :

[అంతట మారీచుఁడు ప్రవేశించును.]

మారీ:—(పానుస్మరణముగా) ఆహా! ఆ క్షత్రియార్భకుఁ డెంతటి పరాక్రమశాలి!

మ॥ జవవిస్ఫారిత రామబాణ పటు జంఝూవాతమం దొక్క_పో
చవలెం దోఁగుచుఁ బల్లటీలఁ గొనుచుం జక్రభ్రమిన్యాయర
త్నవిశేషంబును వల్లెవేసితి నహో! నాకన్న నేఁడాకు లె
క్కువ నేర్చెంగద మానవార్భకుఁ డిసీ! క్షోభించుఁ జిత్తంబి టన్.

(శోకముతో) హా తల్లీ! తాటకా! హా కుమారవత్సలా! హా నాగసహస్రబల
శాలినీ! నీకును రామునిచేఁ జావు కలిగెనుగా? దైవ దుర్విపాకము! హా
సోదరా! సుబాహూ! ఆ దుర్మార్గుని బాణపు టగ్గిని బుగ్గియైతివిగదా? (క్రోధ
ముతో) ఓరీ రామహతకా! నీ క్రొన్నెత్తుటితోఁగాని నా కడుపుమంట చల్లా
రదు. చల్లారదు. కసిఁ దీర్చుకొనకపోను. (చింతతో) కరాళుఁ డుండెనో,
పోయెనో? కూడఁ దెలియకున్నది.

[అంతటఁ గరాళుఁడు ప్రవేశించును.]

కరా:—పోచంతటి యాయువుపట్టుండుటచే బ్రతుకుజీవుఁడాయని రణరంగమునుండి
పలాయన మొనరించితిని గాని లేనిచో నీపాటికి నాకట్టె యెక్కడ పడియుం
డెడిదో. (ఇంచుక పరిక్రమించి) పాపము! మారీచుఁ డేమయ్యెనో? (ముందు
నకుఁ జూచి) ఏమిది? మారీచుఁడు చావు దప్పి కన్ను లొట్టపోయి తొట్లో
యిచ్చటికిఁ జేరుకున్నాఁడే! (సమీపించును.)

మారీ:—కరాళునిఁ జూచి విస్మయముతో) కరాళా! జీవించియే యున్నావా?
న న్నొక్కవరి బిగియారఁ గౌఁగిలించుకొనుము.

కరా:—(కౌఁగిలించుకొని) భాగ్యవశమున రామబాణమును దప్పించుకొంటివి.

మారీ:—నాయనా! ఏమి చెప్పుదును? రామబాణమున నట్టె యాకసమున కెగసి పోయి పోయి సముద్రమునఁ బడితిని. రావణుని వలని భీతిచే నేమి, సహజ దయాతిరేకముచే నేమి సముద్రుఁడు నన్నొట్లో తీరమునకుఁ జేర్చెను.

కరా:—సాగరా! బాగుబాగు. నిజముగా మహారాజ దశాననునివలని భీతిచేఁ దదనుచరుఁడగు మారీచుని రక్షించితివి.

మారీ.—స్వజనవినిపాతమునందలి యౌదాసీన్యముచే నిజముగా నీ మారీచుఁడు మహారాజున కెంతయు నపకీర్తిఁ గలిగించెను.

కరా:—దీనికై చింతయేల? మాయాబలముచే నిప్పుడే యా క్షత్త్రియవటుని మట్టు పెట్టుదము.

మారీ:—ఐన నుపాయమేమి?

కరా:—నీ ప్రజ్ఞాచక్షువున కగోచరమగు నుపాయమునుఁ గలదా?

మారీ:—(ఆలోచన నటించును.)

[తెరలో]

మార్గాయాసమున బడలి శయనించిన తండ్రిగారికి విన్నవింపక రాముఁ డేకాకియై పోరాని యీ కానలోనికి వేఁట తమకమున వెడలినాఁడఁట! ఏ భాగమున నుండెనో వెదకెదఁగాక!

కరా:—రామభద్రుని ప్రియసఖుఁడగు పింగళుని పలుకులవలె నున్నవే? కావున దశరథుని స్కంధావార మీ చుట్టుపట్టుల నెందే నుండనోపు.

మారీ:—(సంతోషముతో) మన యుపాయమునకు శత్రువులే దారిఁ జూపుచున్నారు. పింగళుఁడు రాముని గలిసికొనకముందే నీవు పింగళవేషమునఁ బోయి వన గజముచేతఁ జిక్కితినని యార్తనాదముఁజేసి నిన్ను రక్షింపవచ్చెడు రామ భద్రుని వనములోఁజాల దవ్వుఁగొనిపొమ్ము. నేనును విశ్వామిత్రుని శిష్యుఁడగు కాత్యుని వేషమున వచ్చి మాయచే విరహాబ్ధిధుర యగు సీతను గల్పించి యథామనోరథముగాఁ బని నెఱవేర్చెదు? చాల మెలఁకువతో మెలఁగవలె సుమా!

కరా:—కాతకు దగ్గలు నేర్పవలెనా? పోవుదము రమ్ము. (నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

---

దృశ్యము:— వనములో నొక రమణీయప్రదేశము.

[అంతట శరచాపహస్తుఁడగు రామునుఁడు ప్రవేశించును.]

రాము:—ఆహా ఏమి యీ యారామరామణీయకము!

సీ॥ తీవెకన్నియలకుఁ దీరుతీరు రకాల
పువ్వుల జడలను బొందుపఱచి;
కుసుమకాంతలప్రేమ కోపముల్ సడలింప
సొలపుఁ గౌగింట నుయ్యేలల నూపి;
గుడుగుంచముల నాడుకొనుచుఁ గొమ్మల యెండు
టాకు రైకల మొల్ల నపహరించి;
కాసారనవతరంగములందుఁ బద్మినీ
స్త్రీలతోడుత జలక్రీడ లాడి;
గీ॥ వనవిలాసినితో ముద్దువగలుమీఱ
సరససల్లాపముల వెల్లి విరియఁజేసి;
తనదు దక్షిణనాయకత్వము జగానఁ
జాటుకొనుచుండె నదిగో! వసంతుఁ డహాహా!

(తెరలో)

హా సఖా! రామభద్రా! హాతోఽస్మి, హాతోఽస్మి.

రాము:—(విని సంభ్రమముతో) ఏమిది? ఈ విజనంబగు వనంబున నన్నుఁ గూర్చి యెుక యార్తనాదము వినిపించుచున్నది.

(మరలఁ దెరలో)

అబ్బా! ఈ మాయదారి యేనుఁగు నన్నుఁ బిశాచమువలెఁ బట్టి చంపు చున్నది.

రాము:— ప్రియసఖుఁడగు పింగళుని పలుకులవలె నున్నవే? (త్రొట్రుపడును.)

(మరలఁ దెరలో)

హా తండ్రీ! హాతోఽస్మి. హాతోఽస్మి. హా తల్లీ! మందభాగినీ! మృత్యువున కొప్పఁ జెప్పుటకే నన్నుఁ గంటివా? హా! సఖా! రామభద్రా! నీ స్నేహ మీపాటి దేనా?

రాము:— (కరుణతో) మిత్రమా! భయపడకుము. భయపడకుము. ఇదే నేను, రానే వచ్చితిని. (సమీపించి ధనుష్టంకారముఁ జేసి) ఏమిది? ఇంతలోనే

రేయనుఁగనుకాలికి బుద్ధిచెప్పినది. ఎట్టెట్టో ప్రాణముల దక్కించుకొని పాప మా శిలాతలమున మూర్ఛిల్లిపడియున్నాఁడు పింగళుఁడు.

(అంతట యథానిర్దిష్టముగఁ బింగళవేషమునఁ గరాళుఁడు ప్రవేశించును.)

రాము:—(దగ్గఱించి) మిత్రమా! ఈయఁడిల్లు మూఁడిల్లుము.

చ॥ ప్రణయనవాంబుదంబునఁ దొలంగిన కోరిక లేమొయుంగు లే
యనఘుని పల్కుముత్యముల నాస్థమొయిన్ దొలిముద్దువెట్టి లి
ప్పనుఁగొని సాగుచుండు నటువంటి సుహృద్వరుఁ డిట్లు మూర్ఛలో
మునిఁగి తపించుచుండె నెటుఁబోవుదు? నేమియొనర్తు? దైవమా!

కరా:—(తనలో) దశాననున కేది యిష్టమగునో దానిని. (ఇంచుక కన్నులు తెఱచి ప్రకాశముగా) ఓహో! ప్రియసఖుఁడు రామభద్రుఁడా? దొంగలు పడిన యాఱునెలలకుఁ గుక్కలు మొఱిగిన వఁట!

రాము:—మిత్రమా! సమయమునకు రానేవచ్చితినిగదా? ఏల యీ నాగవల్లి నిష్ఠురము.

కరా:—(లేచికూర్చుండి) రామభద్రా! అబ్బా! ఏమని చెప్పుదును నా యవస్థ? మృగయావినోదతత్పరుఁడవగు నిన్ను వెదకికొనుచు వచ్చుచుండఁగా మధ్య దారిలో—అది యేమి రేయనుఁగో గాని నాయనా! తలఁచుకొనిన గుండెలు బ్రద్దలగును—బ్రతికియుండఁగనే యమయాతన ననుభవింపఁ జేసినది.

రాము:—ఇంతకు మనము లేచిన వేళ మంచిది. పాప మెంతగ జడిసియుంటివో? ప్రచ్ఛాయశీతలంబగు నీ పొగడచెట్టుక్రింద నించుక విశ్రమింపుము.

కరా:—వేటరొత్తిడిచే మిగుల డస్సియున్నావు. నీవును విశ్రమింపుము.

రాము:—సరే! పరిజనులు వచ్చువఱ కిచ్చటనే ప్రొద్దుపుచ్చుకొందము.(కూర్చుండును.)

కరా:—(తనలో) మారీచుఁడు వచ్చునంతవఱ కని చెప్పుము.

రాము:—నిన్నుఁ గుశలముగఁ జూడఁగలుగుట నాభాగ్యము చేతనే సుమా!

చ॥ ప్రకటగుణుండ వీ వెపుడుఁ బజ్జఁ జెలంగుటచేతఁ గాదె? కో
టికిఁ బడగెత్తఁ బ్రేముడి తటిల్లతికోపమదేహయైన జా
నకిని వివాహమాడునని నా మది నుబ్బుచునుండు, నీవె మి
త్రికి నెఱయైన నా తలఁపుఁ దీవెకుఁ గల్గున దంటకోఁతయే?

కరా:—అట్లని నీవు పరాఙ్ముఖుఁడవైనచో జానకి జీవించుటెట్లు?

రాము:—మిత్రమా! నీవు నాతోఁ జెప్పుచుందువే?—

చ॥ తలఁపులమూలి స్వప్నమునఁ దాఁ గనుపట్టఁగఁ జేయుటాది నిఁ
దలఁపున నిల్పి నెమ్మదిని దాపము పట్టి పలార్ప నా సతీ
తిలకము చెల్మికత్తియల తేఁకువమాటల కించుకెట్టటో
మలయుటమాని ప్రాణములమాత్రము నిల్పుకయుండె నో సఖా!

అనిన యాకాశ్యపునిమాట సత్యమే యగునా?

కరా:—(వినమినటించితనలో) ఎంతసేపైనను మారీచుని జాడ కాన్పింపకున్నది.

రాము:—(వెనుకటిదానినే మఱల నడుగును.)

కరా:—(పరాకుతో) కాశ్యపుఁ డెవఁడు?

రాము:—మిత్రమా! చదువవేసిన సున్న మతియుఁ బోయినదే? అతఁడు కౌశికశిష్యుఁ డని నీవే నాకుఁ జెప్పితివిగదా?

కరా:—(తనలో) ఓహో! ప్రమాదము. మారీచుని మీది ధ్యానచేఁ బ్రస్తుత విరుద్ధము సైతముఁ బ్రశ్నించితినిగదా? (ప్రకా) అతని మఱచిన దెవ్వరు? పులినాకి విడచినవాఁడ నగుటచేఁ దొందఱగ జ్ఞప్తికి వచ్చినది గాదు. కాశ్యపుని మాట లసత్యము లగునా?

రాము:—వయస్యా! పరిహాసములకుఁ బుట్టినిండ్లుగదా నీ మాటలు?

కరా:—నా మాట యేల? కాశ్యపుఁడే యిట్లు చెప్పెను.

గీ॥ తావకీన కథా దివ్య భావగీత
మంచితమ్ముగఁ జేతోవిపంచి నాల
పించి నీవు కౌగింట బంధించి నటుల
దలఁచుకొని మైమఱచుచుండు వలపు మిగిలి.

రాము:—(మేను పులకింపఁ దనలో)

మ॥ కలలోనైనను జాగ్రమందయిన నక్కాంతామణిం జూపలే
దల సూనేషుఁడు, కాని తాదృశదశాప్రాగ్భారవైధుర్య నా
వెలఁదిన్ లోఁదలపెట్టినంతటనె హృద్వీథిన్ ద్రపాసాధ్వసా
త్పులకౌతూహలసమ్మదాద్భుతము లంకూరించు నొక్కుమ్మడిన్.

కరా:—మిత్రమా! ఏలకో మిన్నకుంటివి?

రాము:—(సిగ్గుతో) ఆమె విషయము మనకెందుకు లెమ్ము.

కరా:—(నవ్వి) ఓయీ!

ఉ॥ ఆమెచరిత్రఁ జెప్పుమని యాదిని నీవయి పృచ్ఛ జేసి, యా
పై మెయిఁ బుల్కలెత్త విని వారని ప్రేమరసంబు జాల్కొనన్,
"నామదిఁ బర్వలె త్తెడు ఘనంబగు కోర్కులు నీ డెఱుంగునో
యేమొ?" యటంచు నెంచియొ వచించెద వీగతి నద్దుపుల్లలన్?

రాము:—(సిగ్గుతోఁ దనలో) నా చిత్త చాంచల్యము నీతఁడెట్లెఱింగెనో? (ప్రకా) ప్రియవయస్యా! నీ కెఱుంగరానిదని యొకటికలదా? ఆమె నాకు లభింప దేమోయని యాందోళనపడుచున్నాను.

కరా:—(తనలో) ఏమి! ఆమెయెడ నీతనికిఁగల యభిలాష! (ప్రకా) మిత్రమా! నీ కీ చింతయేల? కౌశికమహర్షియే దానిని సంఘటింపఁ గలఁడు.

రాము:—(తనలో) పింగళుఁ డేలకో జరుగని విషయముఁ జెప్పుచున్నాఁడు? (ప్రకా) దాని నెట్లు తెలిసికొంటివి?

కరా:—(తనలో) ఈతని కిది తెలియనే తెలియదా? (ప్రకా)అంతయుఁ గాశ్యపుఁడే చెప్పెను.

(తెరలో)

జెలీ! ఇవే తామరతూండ్లు.

కరా:—(తనలో)మారీచుని మాయానాటకమున కిప్పటి కిప్పుడే నాంది బయలుదేరిన ట్లున్నది:

(అంతట మాయానిగూఢుఁడగు మారీచుఁడు ప్రవేశించును.)

మారీ:—

చ॥ బలువడి సీత నామె పరివారము వారల వారివారి సే
తల నిట నచ్చు గ్రుద్దినవిధాన రచించితి స్వీయమాయచే
నల జనకుండు వచ్చెనని యాయమ నగ్నిఁ బ్రవేశపెట్టినన్
దెలియఁగలేక చిచ్చుఱికితీగుఁ దనంతన రాముఁ డప్పుడే!

దీనిచేఁ దాటకా వధ ప్రతీకారమును, లంకేశ్వర మనోరథమును ముప్పాతిక మూఁడు వీసములు నిర్వర్తింపఁ బడినట్లే. (ముందునకుఁ జూచి) అల్లదే! పొగడ చెట్టుక్రింద మాయాపింగళుఁడగు కరాళునిఁ గూడి రాముఁ డిచ్చటనే యున్నాఁడు.

రాము:—పూజ్యుఁడగు కాశ్యపుఁడా? ఏమో! యజ్ఞనిమిత్తము మిమ్ముఁ బిలుచుటకుఁ గౌశికుఁడు రాఁగలఁడని మాత్రమే చెప్పెను.

మారీ:—(శంకతో) ఏమీ యితఁడు కాశ్యపుఁడా? కాకున్నఁ బూజ్యుఁడగు కాశ్య

పుండాయని యేల సంబోధించును? అతనికి పింగళవేషగ్రహణమునఁ బ్రయోజన మేమో?

కరా:—(తనలో) యజ్ఞమునకుఁ బిలుచుటకు మాత్రమే కౌశికుఁడు వచ్చెనని యీతని యభిప్రాయము. కాని పెండ్లి పిలుపులకని యెఱుంగఁడు (ప్రకా) అది సరి గాదు. కౌశికుని పన్నుగడ మాత్రమే.

మారీ:—(విని భయముతో) ఇఁక నేమి? అంతయుఁ దెల్ల మైనది. ఇతఁడు నిశ్చయముగఁ గాశ్యపుఁడే. తా నీ పింగళవేషము వేయుటయే కౌశికుని పన్నుగడయగుటచేఁ గాశ్యపపద ప్రయోగ మీతనిచే నిషేధింపఁబడినది. కావునఁ గాశ్యప వేషమునఁ దమ కన్నులలో దుమ్ముగొట్టఁ దలఁచిన నన్నెఱుంగుట కిది విశ్వామిత్రుఁడు పన్నిన దుస్తంత్రమగుట నిశ్చయము.

(ధ్యానము నటించును.)

(మఱలఁ దెరలో)

గీ॥ ప్రియుఁడ! నీ యాగడముఁ బచ్చవిల్తుతోడఁ
జెప్పితిని, నిన్నుఁ బ్రణయంపు శృంఖలములఁ
దగిలిచి మదీయ బాహుమధ్యమున ఖైదు
సేయునఁట! చూతు నింకెట్లుచిక్కఁ బోవె?

రాము:—దక్షిణమునుండి యేవో మాటలు వినుపించుచున్నవి. అవి యెవరివో?

కరా:—(అంతటఁ గలయఁ జూచి తనలో) ఇప్పటికైనను గాశ్యపవేషమున మారీచుఁడు రంగస్థలమునఁ బ్రవేశింప లేదు. కావున నిది మాయా ప్రయోగము కాదు. (ప్రకా) వనదేవతలు విహరించుచుండిరేమో!

మారీ:—నిజముగా నీతఁడు కాశ్యపుఁడే. నా మాయ నెఱిఁగిన కరాళుఁడే యైనచో వీరిని జానకీపరిజనులని యేల పలుకఁడు? (ఆలోచించి) ఒకవేళఁ బింగళాకృతి నేతెంచుఁ గరాళునిఁ గౌశికాజ్ఞచేత లక్ష్మణుఁడు చంపి యుండఁడు గదా? కాని మఱి రామ కాశ్యపుల నిద్దరనుఁ గూడ నా మాయచే నిగ్రహింతును. ఇదియే సుబాహునకువలెఁ గరాళున కాత్మశాంతికరము కాఁగలదు.

రాము:—మిత్రమా! గుబురుకొనియున్న యీలతానికుంజమునందు గూఢముగా నుండి చూతము. (శరచాపపాణియై లేచి పరిక్రమించును. కరాళుఁడు వెంబడించును.)

మారీ:—ఆహా! ఏమీ రఘురాముని గాంభీర్యము! చూచినంత మాత్రముననే గుండెలవిసి పోవుచున్నవి. కాని మఱి మాట్లాడించి చూచెద. (ధ్యానమునటించును.)

రాము:—(ముందునకుఁ జూచి విస్మయముతో) ఈ ప్రవాళాస్తర మిచటఁ బడియున్నది. ఎవరిదై యుండునో?

శరా:—మనమాటల సవ్వడిని విని సిగ్గుపడిన యీ కానొక యుత్కంఠిత దీనిని విడచి యుండనోపు!

(మరలఁ దెరలో)

అక్కటా! ఈమె సంతాప మంతకంతకు మితిమీఱుచున్నది.

చ॥ అనతిగ నిద్రవచ్చినను హాయిగఁ గాలము వెళ్లు నేమనం
గను కలవచ్చు, నందు నిజకాంతుఁడు గన్పడు, మెల్లమెల్లఁగా
నను దరియంగవచ్చు, 'లలనామణి! దాసుఁడ'నంచుఁ బైఁటకొం
గునుగొని యేమియేమొ తళుకుల్ పచరించుఁ గరంబు లంటుచున్.

రాము:—వయస్యా! నీ యూహ సరియైనదే.

శరా:—(దుఃఖముతోఁ దనలో) మారీచుఁడు వచ్చుజాడ కాన్పింపదు. ఒకవేళఁ గాశ్యపవేషధారియగు నతని నెఱింగి కౌశికుఁడు లక్ష్మణునిచేఁ జంపించి యుండఁడుగదా! కానిమ్ము. రోటిలోఁ దలఁదూర్చి రోకఁటిపోటునకు వెఱువనేల? (ప్రకా) చెలికాఁడా! మనకీపరనారీవిలోకనముతో నేమిపని? పోవుదమురమ్ము. పరిజను లీపాటికి మనల వెదకి వేసరుచుందురు.

మారీ:—(శోకముతో) రామభద్రుని విముఖుని జేయుచున్నాఁడితఁడు నిశ్చయముగాఁ గాశ్యపుఁడే! వీరి మనస్సును వేఱొకచోటికి మఱల్చెద. (ధ్యానము నటించును.)

రాము:—ఆహా! అరవింద మరంద మత్తమిళింద ఝుంకార సంగీతభంగీతరంగమ్ములు మిన్నుముట్ట, శుక పిక శారికా భూసురాశీర్వాద పురస్సరంబుగ నల్లదే! విపాకమధుర ఫల భార నమిత రాజరంభాస్తంభ సంభావితంబగు మాధవీ మంటపమున నూతన వధూవరులగు వనీవసంతులు పూలసేసలు చల్లుకొనుచున్నారు.

శరా:—ఈ సంవిధానము చూడఁ జూడ రమణీయ మగుచున్నది.

మారీ:—(పండ్లు పటపటఁగొఱుకుచు) ఓరీ కాశ్యపా! ఈ మారీచుని చేతిలో నీకుఁ జావు మూడినది. (ధ్యానము నటించును.)

(మరలఁ దెరలో)

చెలీ! ఈ చందనరసము నీమె శరీరముపైఁ జిలుకరించుము.

శరా:—(తనలో) వీరి పలుకులెంత ముద్దు గొలుపుచున్నవి? సమీపించి చూతునా? ఏ మొగముపెట్టుకొని చూతును? మారీచుఁ డుండెనో—ఊడెనో తెలియక కొట్టుమిట్టాడు నాకు ధైర్యమెక్కడ?

రాము:—(డగ్గఱించి) సమాన రూపరేఖా వయో విలాసినులగు వీ రెవ్వరో?

(అంతటఁ గిసలయ శయనోపవిష్టయగు మాయాసీతయు, నామె చెలికత్తెలును ప్రవేశింతురు.)

1. చెలి:—సఖీ! ఇంతటి యావేగము పనికిరాదు.

2. చెలి:—ఒక్కింత ధైర్యము వహింపుము.

కరా:—(చూచి తనలో) ఆహా! అసాధారణరూపలావణ్యవతియగు నా విలాసిని యెవతియో జానకీశరీరముతో మదనవికారము ననుభవించుచున్నది. కావున నిది మారీచుని మాయప్రయోగమే కావచ్చును. ఎటుపోయి యెటువచ్చునో? కాని యింకనుఁ బరికింతును. (ప్రకా) వీ రచ్చర మచ్చుకంటు లేమో?

రాము:—వీరందఱనడుమఁ జుక్కలలోఁ జంద్రునివలె నున్న యామెఁ గంటివా?

ఉ॥ ఈవనసీమ లేయెద నటింపులు వ్రాయెడి తీయకోర్కె పూఁ
దీవెల మ్రోదువార్చికొని తేటఁ దొలంగి విషాదగీతికల్
జీవిత మాధురిన్ మఱుఁగుసేయఁ గృశించెదు నీ మనోజ్ఞ లీ
లావతి—ఈ సుధాప్రణయలక్ష్మి యెవర్తుకయో సుహృద్వరా!

కరా:—(తనలో) ఇది నిజముగా మారీచుని మాయాప్రయోగమే? (ప్రకా) రామభద్రా! కౌశికాశ్రమ మిచ్చటి కనతిదూరమం దుండుటం జేసి యీయామె జానకియే గావచ్చును.

మారీ:— (సంతోషముతో) ఇప్పటికి రాముఁ డీకాశ్యపునిచేతనే మారీచమాయావాగురం దవులు కొనినాఁడు. వంటయింటికుందే ళ్ళివి యెందుఁబోఁగలవు?

రాము:—(తనలో)ఇదినిజమే యైయుండును. జానకి విరహవేదన నిట్లువర్ణించెనుగదా కాశ్యపుఁడు? (ప్రకా) ఏల యీ శుష్కప్రియములును శూన్యహస్తములును.

(అంతటఁ గాశ్యపుఁడు ప్రవేశించును.)

కాశ్య:—మృగయావినోదతత్పరుఁడగు రామభద్రుఁ డింకను వచ్చుజాడ కాన్పించదు. పింగళుఁ డొకింత నాతో వెదకినట్లే వెదకి యెందేగెనో తెలియదు. కాని యీమామిడితోపులోఁ గూడ వెదకెద. (పరిక్రమించును.)

కరా:—(కాశ్యపునిఁ జూచి తనలో) అదే కాశ్యపవేషధారియైన మారీచుఁడు రాముని కన్నులఁ గప్పుటకు వచ్చుచున్నాఁడు. (ప్రకా) వయస్యా! పోనిమ్ము. నావి వట్టి శుష్కప్రియములే యనుకొనుము. సీతా వృత్తాంత వేదియగు కాశ్యపుఁడు మన మిటనున్న సంగతి నెఱుంగక కాఁబోలు! అటెటో పోవుచున్నాఁడు. నే నేగి యాతని వెంటఁ బెట్టుకొని వచ్చెద. సర్వమునతఁడే చెప్పఁగలఁడు. (వెళ్లును.)

మారీ:—ఏలకో రాముని వీడి పింగళవేషియగు కాశ్యపుఁడు చాలదవ్వరిగెను. కావున యథా సంకల్పితముగా వీని నొక యాటాడించెద. (ధ్యానము నటించును.)

సీత:—

గీ॥ విరహతాపము నెమ్మది వేఁచుచుండ
నిట్టి శిశిరోపచారము లేమిసేయ
నేర్చు? దివసంబునఁ గొలంకు నీటిచేతఁ
గలువకన్నకు సౌఖ్యంబు గలుగుటెట్లు?॥

(వేదన నభినయించును.)

మారీ:—(శాక్యుల వేషమును ధరించి) పింగళ వేషధారియగు శాక్యుఁడు దాపున లేమిం జేసి మదీయ మాయాబలంబున రాము నాకర్షించుటకే యడ్డంకియు లేదు. (పరిక్రమించును).

రాము:—ఆహా! ఏమి యీమె సౌందర్యము?

చ॥ ఇది కడు సౌష్ఠవంబు మఱి యియ్యది సౌష్ఠవహీనమం చనం
బొదలక నెల్లయంగములు ముద్దులుమూటలుగట్టు మాయురే!
ముదిమది దప్పినట్టి విధి పోఁడిమి నీమె సృజించుటెట్టు ల
మ్మదనుఁడె స్వీయశస్త్రములమార్చి యిటుల్ రచియింపఁబోలెడిన్.

మారీ:—(నవ్వి తనలో) మారీచ కృతమనిన బాగుగ నుండును.

రాము:—మారీచునిఁ జూచి తనలో) శాక్యుఁ డిదే వచ్చెను. ఇతనిం జూచుటకు నా మనంబు సిగ్గు పడుచున్నది. (తల వంచుకొనును.)

మారీ:—మా రామ భద్రునకు విజయము.

రాము:—(మోమెత్తి) శాక్యుఁడేనా?

మారీ:—(శంకతోఁ దనలో) ఏమిది? ఇతఁడు నా కపట మెఱింగెనా యేమి? (విమర్శించి) అది యసంభవము. నిజముగ శాక్యుఁడ నని తలంచి పింగళ వేషము నుజ్జగించి స్వీయ వేషమును ధరించుట యందలి భావమును బ్రశ్నించు చున్నాఁడు. (ప్రకా) నేను నిజముగా మహర్షి శిష్యుఁడనే.

రాము:—(తనలో) నిశ్చయముగ నితఁడే పింగళునిచేఁ జూడఁ బడినవాఁడు. (ప్రకా) మిత్రమా! ఈమెయేనా సీత?

మారీ:—(తనలో) ఆ పింగళ వేషధారి శాక్యుఁడు కాఁడు. కనుకనే నీవు నిక్కముగఁ గాక్యుఁడవే యైనచో బింగళుం డెందేగనని ప్రశ్నింప చున్నాఁడు. (ప్రకా) ఔ నీమెయే సీత.

రాము:—(హర్షముతోఁ దనలో) హృదయమా! ధన్యురాలవు. ధన్యురాలవు. (ప్రకా) వయస్యా! ఈమెనుగుఱించి పింగళుఁడన్నదంతయు సత్యమన్నమాటయే!

మారీ:—(దుఃఖముతోఁ దనలో) అతఁడు నిజముగఁ బింగళుఁడే. కరాళుఁడు లక్ష్మణుని వాతఁ బడినట్లే. (ప్రకా) ఏడీ పింగళుఁడు?

రాము:—(తనలో) పింగళుఁ డీతనిఁ గలిసికొననేలేదా? (ప్రకా) నీవు వచ్చుచుంటివని చెప్పి యాతఁ డిటే పోయియుండెను. వెనుకటివలెనే వనగజమునకుఁ జిక్కి యుండఁడుగదా ?

మారీ:—(సంతోషముతోఁ దనలో) కరాళుఁడే పింగళరూపమున రాము నాకర్షించినది. నే ననవసరముగఁ ద్రాటినిజూచి పామనుకొంటిని. (ప్రకా) ఏమో! నా కాతఁ డెందునుఁ గాన్పింపలేదు.

కాశ్య:—(ముందునకుఁజూచి) ఏమిది! కిసలయశయనోపవిష్టయై జానకి మదనవేదన ననుభవించుచున్నది. ఈ ప్రదేశము కౌశికాశ్రమమున కఱయామడపైనన్నది. ఇచ్చట నిది యెట్లు సంభవించును? మనుజులఁబోలిన మనుజులుందురు. ఈమె మఱి యెవ్వతెయైనఁ గాఁగూడదా? (వేఱొకవైపునకుఁజూచి భయముతో) ఆ కనుపించు పాషాణమునకు సమీపమున హవ్యవాహనుఁడు పరాక్రమించుచున్నాఁడే! విరహజ్వరావేగము సహింపలేక యీమె యిందుఁజికి ప్రాణముల వీడునని తోఁచుచున్నది. కానిమ్మిచ్చటఁగూర్చుండి పరికించెద. ఈలోపలఁ బింగళుఁడుగాని రాముఁడుగాని రాకుందురా? (కూర్చుండును.)

(అంతటఁ బింగళుఁడు ప్రవేశించును.)

పింగ:—ఆహా! మృగయాప్రవృత్తుండగు రామభద్రుఁ డెందేగెనోగదా! కాలికి బలపముఁగట్టుకొని వనమంతయు గాలింపుగంగవలెఁ దిరిగితిని. కాని లాభము లేకపోయెను. కాశ్యపుఁ డొకింతనాతో వచ్చినట్లెవచ్చి యేమాయెనో తెలియదు. కాని మ్మింకను బరిశీలించెద. (ముందునకుఁజూచి) రాముఁడు కాశ్యపునిఁగూడి యిచ్చటనే యున్నాఁడు. సమీపించెద. (పరిక్రమించును).

మారీ:—(చూచి తనలో) పింగళవేషియగు కరాళుఁడే వచ్చుచున్నాఁడు. (ప్రకా) వయస్యా! అనుకొనుచుండఁగనే పింగళుఁడును వచ్చెను.

రాము:—పింగళా! ఇప్పటికి నీమాట నమ్మికకు వచ్చినది.

పింగ:—(తనలో) ఏమిది? అసమయమున నీతఁ డిట్లనుచున్నాఁడు (ప్రకా) మిత్రమా! నీ మాట యేమో నా కంతుపట్టుటలేదు.

మారీ:—(పింగళునిఁ గౌఁగిలించుకొని జనాంతికముగా) కరాళా! భ్రమపడకుము. అదృష్టవశమున నీవు జీవించియుండఁ జూచితిని. ఇంతసేపటివఱకుఁ గాశ్యపుఁడు పింగళవేషము వేసిననియు, నీవు లక్ష్మణబాణపాతమున కెఱయైతివనియు, శంకించుకొని మిగుల క్షోభిల్లుచుంటిని.

పింగ:—(తనలో) కాశ్యపుఁడుకూడ నసంబద్ధప్రలాపముల నేకరువుపెట్టుచున్నాఁడు? (ప్రకా) ఏదీ నీవుచెప్పినది మరల నొక్కసారి చెప్పుము.

మారీ:—(భయముతోఁ జూచుచుండును.)

రాము:—మిత్రమా! ఈ సుందరీమణులఁ గూర్చియే నేను చెప్పుచున్నది. (కనుసన్న చేతఁజూపును.)

పింగ:—(తనలో) ఉత్కంఠితయగు సీత సఖులతో నా చెట్లచాటునఁ గనుపించుచున్నది. కనుకనే 'యీయామె యిట్టి యవస్థలో నున్నది' అని వెనుక నేను చెప్పినదానినే యిప్పుడితఁడు జ్ఞప్తికిఁ దెచ్చుచున్నాఁడు. (విమర్శతో) ఇదియెట్లు సంభవించును? కౌశికాశ్రమ మిచ్చోటి కఱుయామడపైననున్నదే?

మారీ:—(తనలో) ఇతఁడు కరాళుఁడుకాఁడు. నిజమగు పింగళుఁడే. అయ్యో! కరాళుఁడనుకొని గుట్టంతయు బయఁటఁ బెట్టుకొంటినే? కాలుజారినఁ దీసుకొనవచ్చునుగాని నోరుజారినఁ దీసుకొనుట కష్టము. కరాళుఁ డెటుబోయెనో గదా? కానిమ్ము. శోకమున కిది సమయముగాదు. మాయచే రామభద్రుని కథకు భరతవాక్యము పలుకవలయును (ధ్యానము నటించును.)

1. చెలి:—కలువజవరాలికివలెనే యీ కలువకంటి కీ శిశిరోపచారము లేమి జాలిఁ గొల్పఁగలవు? రామచంద్రుని ప్రేమపరిరంభములఁ దక్క నీమెకు వేఱుగ సౌఖ్యము కలుగదు.

రాము:—ఈ చెలిమికత్తె పలుకులకు నా యొడలు పులకించుచున్నది. అగడపల క్రొన్నిటిచేతఁ గడిమిచెట్లు పుష్పించునుగదా?

పింగ:—(శంకతోఁ దనలో) ఈతఁడు కాశ్యపుఁడు కాఁడు. తాటక చావును మనస్సునఁ బెట్టుకొని కసిఁ దీర్చుకొనుటకై కొండొక రాక్షసుఁడు స్వీయమాయచే జానకిం గల్పించి రాము నీ విధమునఁ జెవులుపట్టి యాడించుచున్నాఁడు. కనుకనే యేమేమో తబ్బిబ్బులాడి తిరిగిఁ బ్రశ్నించిన నాలుక కఱచుకొని తెల్లమొగము వేసినాఁడు. (ప్రకా) రామభద్రా! ఈమె జానకి కాదు. వారు పరిజనులునుగారు. ఈ ఘోరాటవి నదియెట్లు సంభవించును?

రాము:—(తనలో) ఏమీ కని పూర్వాపర విరుద్ధ వచనములు? ఇతఁడేగదా యీయామె జానకియనిచెప్పి తద్వృత్తాంత వేదియగు కాశ్యపునిఁ దీసికొని వచ్చెదనని వెళ్ళియుండెను. ఇంతలో నీ మార్పేమి? ప్రియజన పరివృతయగు నీమె మాయాజానకి యెట్లగును? (ప్రకా) కాశ్యపుఁడీ మాటలు వినెనుగదా!

మారీ:—(రామునితో జనాంతికముగా) రామా! నీవు తాటకం జంపుటంజేసి కొండొక రాక్షసుఁడు నీపైఁ గసిఁ దీర్చుకొనుటకై తన మాయచే నిన్నిట్లు భ్రమపెట్టుచున్నాఁడు. (ధ్యానము నటించును.)

రాము:—ఆర్యా! నిజమాడితివి. మన మాటలకీ రాక్షసుఁడు పానకములోని పుడక యయ్యెనే?

పింగ:—(తనలో) అంతకంతఁకు కాకము ముదురుచున్నది. చెట్టయి వంగనిది మ్రానైవంగునా? (ప్రకా) మ్రొక్కఁబోయిన గుడివిరిగి మీఁదఁబడినట్లు నిజ

ము చెప్పఁబోవ నాపై రాక్షసుఁడను నిందపడినదే? మిత్రమా! సవిమర్శముగ మాట్లాడుము.

సీత:—మందభాగిని నగు నాకేనా యది లభించుట?

రాము:—ఏమంటివి? మదీయపరిరంభణము దుర్లభమనియా? నీకటాక్ష వీక్షణ సమ్మోహనాస్త్రములు పట్టి నీయొద్ది కాకర్షించుచుండ వానికిఁ గైవసము కానంతటి ప్రజ్ఞాశాలినా నేను?

మారీ:—(తనలో) ఈతని యనురాగబీజము పాతాళము దనుక వేళ్లుదన్నినది. ఇఁక నావని సెలవిచ్చినట్లే (ప్రకా) ప్రియురాలి కోర్కె తీర్చుటయే వయస్యుని కర్తవ్యము.

రాము:—

చ॥ అటవుల నోర్తు గంటినఁట—(ఆశ్చర్యముతో)
ఆమెయె తజ్జనకాత్మజాతయౌ
నఁట; విరహజ్వరార్తయఁట—(హర్షానురాగములతో)
అయ్యదియుం గన మన్నిమిత్తమే
నఁట; ఉపశాంతి తాదృశ మహార్తికి—(రోమాంచముతో)
మత్పరిరంభణంబుచే
నఁట! ఇఁకఁ బెండ్లిగాని పడుచౌట మనంబున భీతిగ్రాలెడిన్.

మారీ:—(ధ్యానము నటించును.)

2. చెలి:—దుర్లభమెట్లు? కౌశికమహర్షి కలఁడుగదా?

1. చెలి:—సఖీ! దాని నటుంచుము. దశగ్రీవుఁడు తన్నర్థించునేమో యని యీమె యాందోళనము.

సీత:—(కన్నీటితో) నన్ను దశగ్రీవుఁడు నర్థించునా? వైవాహాభిమానంబున నన్నొక వేళ నా జనకుఁ డతని కంటఁ గట్టిన యెడల విసము నైనఁ ద్రావెద. చిచ్చునైన నుఱికెద.

రాము:—(ఆనందముతో) వేయి యేండ్లు తలక్రిందుగఁ దపస్సుఁ జేసినను నిట్టి యన్నులమిన్న లభించునా?

కాశ్య:—(కరాళునిఁ జూచి) ఓయీ పింగళా! మృగయా ప్రవృత్తుఁడగు రామచంద్రునిఁ గలిసి కొంటివా?

కరా:—కలిసి కొనుటయే కాదు. నీవు చెప్పిన చొప్పున నాతనిఁ జాల దవ్వు రప్పించితిని. ఇదె వచ్చెద వదె వచ్చెద వని నోరు తెఱచుకొని నీ రాకకై చూచి చూచి కన్నులు కాయలు కాచినవి. కాని నీ వెంతకును రాకుండుటచే

లక్ష్మణుని వాతఁ బడితి నేమో యని భయ పడితిని. కాని దైవ వశమున మరల నిన్నుఁ జూడఁ గలిగితిని.

కాశ్య:—(ఆశ్చర్యముతోఁ దనలో) లక్ష్మణుని శత్రువులలోఁ బింగళుఁ డను వాఁ డొకఁ డుండు టేమి? తన్మిత్రుఁడ నగు నన్నుఁ దన వానిఁగాఁ జూచు కొను టేమి? (అంతటఁ గలయం జూచి) అల్లదే! అచ్చట నా రూపమున నున్న దెవరు? కానిమ్ము. నిజము నిలుకడ మీఁదఁ గాని తెలదు. (ప్రకా) ఇప్పుడు రామభద్రుఁ డెచ్చట నున్నాఁడు?

కరా:—(తనలో) ఈతని మన స్సంతయు రామభద్రునిపై నుండుటచే నేను జేసిన యీ ఘన కార్యమునకు నన్ను మెచ్చుకొనలేదు. (ప్రకా) సీతను జూచుచు నా మామిడి చెట్టు దరి నున్నాఁడు.

కాశ్య:—ఆమె సీతయే యని నీ వెట్లు తెలిసికొంటివి?

కరా:—(నవ్వి) మొదట నీ వన్నట్లే శంకించియుఁ గ్రమముగా నీ మాయా విలాస మని తెలిసికొంటిని. తాటకా కుమారుండ వగు నీవు మా యందఱకన్న మిన్నవు గదా?

కాశ్య:—(ఉద్వేగముతోఁ దనలో) ఇప్పు డంతయుఁ దేలినది. ఇతఁ డెవఁడో మారీచుని యనుచరుఁడు. మారీచుఁడు నా రూపము ధరించి రాముని యొద్ద నాటక మాడుచున్నాఁడు. వచ్చి వచ్చి యీ పెద్దపులి నోటఁ బడితినే? హా! ఇఁక బ్రతుకు తెరు వెయ్యది? (భయముచే మూర్ఛిల్లును.)

కరా:— ఊఁ ఆడిల్లు మూఁ ఆడిల్లుము. తాటకం దలంచుకొని యిట్లు దుఃఖించిన లాభమేమి? ఆ రాజ పుత్రునికిఁ బ్రతీకారము సేయవలెను

కాశ్య:—(లేచి యంజలి బంధించి) అయ్యా! నాజోలికి మాత్రము రాకుము. నేను మారీచుఁడను గాను. నన్ను రక్షించి పుణ్యము గట్టుకొనుము. నాయనా! నీ కొక నమస్కారము.

కరా:—ఇతఁడు విప్రవటువే నా? ఇతఁడే మారీచుఁడనుకొని విషయమంతయు వెళ్ళఁ గ్రక్కితినే? పెదవి దాటినఁ బృథ్వి దాటును గదా? (శోకముతో) హా! మారీచా! హా వివిధమాయా సంప్రదాయగురూ!—(అర్థోక్తిలో) ఈ వ్యర్థప్రలాపము లతోఁ బనియేమి? (కోపముతో) ఓరీ సుమిత్రాగర్భవిప్లోషణా! (విమర్శతో) దీనిచే లాభము లేకపోవుటట్లుండ నాచావునకు నాయంతట నేనే త్రోవతీసు కొన్నట్లగును. ముందుగా నీ బ్రహ్మచారిని మట్టుబెట్టెదను. వచ్చినవాని పెండ్లికి వచ్చినంతరయే కట్నము. (కాశ్యపునిగొంతు పట్టుకొనును.)

కాశ్య:—(పెనుగులాడుచు)

గీ॥ రాఁగదే రామ! రక్షింపరాఁగదయ్య
చంపుచుండె మారీచానుచరుఁడు నన్ను

అందఱకు నేను లోకువనైన నాకు
నంబికొండాయి లోకువన్ పగిదిఁ గడఁగి.

(తప్పించుకొని రామునివంకకుఁ బరుగెత్తును.)

రాము:—ఏమిది? కాశ్యపుని వలుకులవలె నున్నవే? వయస్యా! భయపడకుము. భయపడకుము.—(అర్థోక్తిలో)

మారీ:—కాశ్యపుని నీప్రక్క నుంచుకొనియే యేమేమో పలుకుచున్నావు?

కరా:—(కాశ్యపు నతిక్రమించి కాశ్యపుఁడు చదివిన పద్యమును జదువుచు వచ్చి రామునిఁ గౌఁగిలించుకొనును.)

రాము:—కాశ్యపా! పింగళు డిదే వచ్చెను.

మారీ:—(హర్షముతోఁ దనలో) ఇతఁడే కరాళుఁడు. కాశ్యపునిఁ గూడివచ్చినాఁడు. (ప్రకా) మిత్రమా! నారూపమునుధరించిన మారీచునిఁ జూడుము (కాశ్యపునిఁ జూపును.)

కాశ్య:—రామభద్రా! మారీచుఁడే నారూపము ధరించి నీప్రక్కఁజేరి యీతెఱి సీతయని నిన్ను దుద్దువెట్టుచున్నాఁడు.

కరా:—(సంతోషముతోఁ దనలో) దైవవశమున మారీచుఁడు బ్రతికియున్నాఁడు. (ప్రకా) నారూపము ధరించిన యితఁడెవ్వఁడు? గ్రుడ్లు మిటకరించుకొని చూచుచున్నాఁడు.

పింగ:—ఓరీ! త్రుళ్ళకుము ఇల్లలికినంతనే పండువగాదు. నీమొగమునసే బ్రొద్దుపొడుచ లేదు.

మారీ:—అతనితో నేమి? రాముఁ డాతని నీవఱకే రాక్షసునిఁగ నిర్ణయించెను.

పింగ:—కాశ్యపా! నన్ను మొదటఁ 'గరాళా!'యని సంబోధించి యంతటితోఁ దోఁకముడుచుకొన్న త్వద్రూపధారి యగు నీతఁడు మారీచుఁడు. కావున నా రూపము ధరించిన యీతఁడు కరాళుఁడు కావచ్చును.

రాము:—ఈతఁడేలకో కాశ్యపుని మారీచుఁడనియు, సీతను మాయయనియుఁ, బింగ ళునిఁ గరాళుఁడనియుఁ జెప్పుచున్నాఁడు. (నల్వురనుజూచి) ఆశ్చర్య మాశ్చ ర్యము!

కం. ఇరువురు పింగళులును మఱి
నిరువురు కాశ్యపులు నొకటనే కూడిరి, యిం
దిరువురు ప్రియమిత్రులు మఱి
నిరువురు రక్కసులు నెట్టు లెఱుఁగుదు వీరిన్.

మారీ:—(పింగళ కాళ్యపులఁ జూపుచు)

గీ॥ చిత్తరులు వీరు రాక్షసుల్ వేషధరులు
వేగిరింపుము వీరల వీచమడఁప—

రాము:—(క్రోధముతో శరము సంధింప నుద్యుక్తుఁడగును.)

కాళ్య:—

గీ॥ ప్రియవయస్యుఁడ! ఇద్ది మారీచు మాయ
వలయు సువిమర్శ వేగిరపాటు వలదు.

రాము:—ఎట్లిది?

ఉ॥ ప్రేయసియందు రాయమగు వీరలు, హా రది రాక్షసప్రకృ
న్మాయయటందు రందులకు మానస మీరసమందు నైన నా
చేయది రాదుచంపుటకుఁ జిత్రము వీరలఁ జూడ వెన్కకున్
బోయిన నూయి ముందునకుఁబోయిన గోయియునయ్యె నిత్తఱిన్.

మారీ:—ఏల యీ సందిగ్ధావస్థయందును శరమును విడువకుంటివి? (ధ్యానము నటించును.)

(ఒక చెలికత్తె సంభ్రమముతోఁ బ్రవేశించును.)

3 చెలి:—హా! హా!! ఇఁక నేమిగతి?

(అందఱు విని భయముతోఁ జూచుచుందురు.)

1 చెలి:—సఖీ! చెప్పుము చెప్పుము. ఏల యీ సంభ్రమము?

సీత:—(ఉద్వేగముతో) చెప్పుము. చెప్పు మేమిజరిగినదో? నాహృదయము తటుకు కొనిపోవు చున్నది.

3. చెలి:—అయ్యో! కొంప మునిఁగినది. అప్రియము నెట్లుచెప్పుదును?

సీత, 1. చెలి, 2. చెలి:—తొందఱగాఁ జెప్పుము విని కర్తవ్య మాలోచింతము.

3. చెలి:—ఏమిచెప్పుదును? (కన్నీరు విడుచుచు) ఎంతగఁ బ్రార్థించినను సీత నిచ్చుట కొప్పుకొనకుండుటచే జనకులపై దశగ్రీవుఁడు కోపించి—

సీత:—తండ్రిగారి కే యాపదయు గలుగలేదుగదా?

3. చెలి:—వారి శిరస్సును దునిమి మన ప్రియసఖిని ఎత్తుకొని పోవుటకే వచ్చు చున్నాఁడు.

సీత:—(దుఃఖముతో) ఏమి చేయుద నేమి చేయుదను !! (నిలచును.)

చెలులు:—హా! హా !! అత్యాహిత మత్యాహితము. (సీత ననుసరింతురు.)

రాము:—(తొందఱతో సమీపించి) భయపడకుము జానకీ! భయపడకుము. ఎత్తుకొని పోవుట కతని దేమి గుండెయా చాలువా? ఈ ముక్కిడి రక్కసులను ముక్కడంప నెక్కువెట్టిన యీ బాణము చేతనే——

కరా:—(భయమున మారీచునితో జనాంతికముగా) ఈతఁ డేమి సేయునో మన కిఁక గతియేమి?

మారీ:—(జనాంతికముగా) గుమ్మడికాయల దొంగయని భుజమును తడుముకొనఁ దవేల? ఈ దాడి మనమీఁదికిఁ గాదు. ఈ బ్రహ్మచారులఁగూర్చియే యట్లుపలికినాఁడు.

రాము:—జనకుని సంహరించిన యీ దశాననుని యుత్తమాంగము నుత్తరించెద.

కాశ్య:—ఇట్టిక యమంగళము లాడెద వేల? జనక దశాననులు ప్రియమిత్రులు గదా? నీ కీ యకాండతాండవ మేల?

కరా:—ఎల్లప్పుడు విరుద్ధములాడెడు నీతఁడు వధ్యుఁడు.

మారీ:—

గీ॥ బిత్తరులు వీరు రాక్షసుల్ వేషధరులు
వేగిరింపుము వీరల పీచమడఁప (ధ్యానము నటించును.)

కాశ్య:—

ప్రియవయస్యుఁడ! ఇద్ది మారీచు మాయ
వలయు సువిమర్శ వేగిరపాటు వలదు.

సీత:—ఈ శిల నధిరోహించి చెట్లయొుఱపిడిచేఁ గలిగిన యీ దవానలంబునఁ బడి పితృశోకమును, ఆ మహాపురుషునియందలి ప్రేమచేఁ గలిగిన మదనజ్వరంబును శాంతింపఁ జేసికొనియెద. (నిష్క్రమించును.)

చెలులు:—సఖీ! జానకీ! మమ్ము వీడి చిచ్చుఱుకుచున్నావా? అక్కటా! ఈ విశ్లేష మెట్లు భరింతుము? (నిరూపించి) జానకి యిప్పుడే యగ్నిం బ్రవేశించినదే. హా! సఖీ! హా విదేహకుల మంగళ దీపికా? (ఒండొరులతో) ఈ యరణ్య రోదనము వలనఁ బ్రయోజన మేమి? మనమునుఁ బ్రియ సఖి ననుసరింతము. (నిష్క్రమింతురు.)

రాము:—(శరసంధానము నుజ్జగించి) అయ్యో! నా కుసుమారథ మందారము—త్రిభువన భూషణము—వంశ జానన యశః కర్పూరము—మీన కేతన కేతనము—నేత్రోత్సవము—అంతరించెను. అంతరించెను!!! కటకటా!

గీ॥ భూమి తనలోన నన్నుఁ గల్పుకొన దేల?
మృత్యువున కక్కటిక మేల? మిన్ను విరిగి

పైనఁ బడ దేల? యీ పాడు ప్రాణవాయు
లెగసిపో వేల? నక్కటా! ఏమిసేతు?

మారీ:— (తనలో) సమయానుకూల వచన రచనా దోహదమున సీతని యావేగము నింకను వృద్ధి వఱచెద (ప్రకా) హా సీతా! హా దేవ యజన సంభవా! హా విదేహకుల నందినీ! హా త్రిభువ నైక సౌందర్య శాలినీ! రామ మస్త్రైక జీవనీ! ఆ మూల దైవము నీకు నిట్టి చావుఁ గల్పించెనా? (మూర్ఛ నటించును.)

కరా:—(తనలో మారీచుఁ డనిన బాగుండును. (ప్రకా) కాశ్యపా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

పింగ:— మారీచుని చాకచక్యమే మెచ్చఁదగినది. రామునికన్న ముందే మూర్ఛ పోయినాఁడు. 'అసలు తిననమ్మ అట్లే యున్నది. ముప్పాట తిని నమ్మ మూర్ఛ పోయినదఁట.'

రాము:—

గీ॥ గరళముం ద్రావుదున? మహీధరమునుండి
కూలుదున? సాగరమున దూకుదున? ఇంక
నెందుఁబోయెద?. . .

కరా:—(తనలో) తాటకనుగాని సుబాహువునుగాని యడుగుము.

రాము:—

ఈ వహ్నియందె చొచ్చి
కలిసికొందున నా ప్రియాంగనను దివిని?

మారీ:—(తనలో) అట్లేచేయుము. మా కోరికయు నదియే. (ప్రకా) వయస్యా! జానకీ ప్రేమభరమున కిది యేపాటిది?

కాశ్య:—అయ్యో! అయ్యో!! వీరి మిథ్యాచరిత్రము లంతకంతకు విస్మయమును గొల్పుచున్నవి!!!

రాము:—ఇఁక నాకీ లోకములో నేమిపని? ఈపాషాణము నెక్కి యథామనోరథముగ జానకి ననుసరింతును. ఆలసించినఁ జాలదూరము పోవునేమో?

(రాతి నెక్కును.)

పింగ:—ఆహా! రాక్షసులచేతఁ బూర్తిగ వంచింపఁ బడితిమి. కౌశికున కీ వృత్తాంత మెట్లు తెలియును? చెలిమిచేతఁ జేదుమేపింప వచ్చునుగాని బల్మిని బాలు ద్రాగింపలేము. ఇఁక నేమిగతి?

మారీ:—(హర్షపారవశ్యముతో) అమ్మయ్య! నా మనోరథము కొనసాగినది.

గీ॥ తివిరి కన్నుండఁ గనుపాపఁ దీయు శక్తి
కలుగువాఁడను నా చేతిబలిమి రామ
భద్రు నదె తాటకావధ పాతకంబు
కట్టి కుడుపుచునున్నది, కను కరాళి!

కరా:—(బొమముడిపాటుతో హుంకరించి వలదని కన్నుగీటును.)

పింగ:—(కాశ్యపుని చేయిఁ జఱచి .నవ్వుచున్నాఁడు.)

కాశ్య:—రామభద్రా! వింటివి గదా? నీ కాశ్యపుని మాటలు.

రాము:—(శంకతో) ఆఁ! ఏమి!! (మఱలఁ దన స్థానమునకు వచ్చుచున్నాఁడు.)

మారీ:—(కరాళునితో జనాంతికముగ) హర్షపారవశ్యముచే నా పాపిష్ఠినోరి వచ్చినట్లు వాగినది. ఇఁకఁ గర్తవ్య మేమి?

కరా:—ఇంతకన్నఁ గర్తవ్యమేమి? కాలికి బుద్ధిఁజెప్పుదము. (పాఱిపోవుదురు.)

రాము:— తుంటరులారా! నిలువుఁడు నిలువుఁడు. (శరము విడుచును.)

కాశ్య:—రామబాణము తగిలియుఁ దగులక మునుపే కరాళుఁ డొక కొండవలె నిలువునఁ గూలినాఁడు. మాయావి యగు మారీచుఁ డదృశ్యుఁడై తప్పుకొనినాఁడు.

పింగ:—(రాతివంకఁజూచి) రామపాదస్పర్శచే నా రాయి యొక స్త్రీరూపము నొందినది. ఆశ్చర్య మాశ్చర్యము!!

(అంతట నహల్య ప్రవేశించును.)

అహ:—జయము జయము రామచంద్రా! జయము జయము.

రాము:—అమ్మగారు కౌసల్యవలె నీమె యెవరో నన్నుఁ బిలచుచున్నది.

అహ:—దేవాదిదేవా! రామచంద్రా!

ఉ॥ ఏ నిట నాథుఁ డల్క శపియింప శిలాకృతి నెండ కెందుచుఁ
వానకు వాడుచుఁ వనమునం బడియుంటిని దిక్కులేక దే
వా! ననుఁ దావకీనపదపాంసువునం బరిపూతఁ జేసితౌ
మా నస లెల్లఁ దీరె మునిమానససారసరాజహంసమా!

రాము:—(తనలో) ఈమె విషయ మప్పుడప్పుడు కౌశికుఁడు చెప్పుచుండును. (ప్రకా) భగవతీ! దాశరథి యిదే నమస్కరించుచున్నాఁడు.

అహ:—చిరంజీవ!

పింగ } భగవతీ! శతానంద జననీ! నమస్కారము.
కాశ్య }

అహ:—అభీష్టసిద్ధిరస్తు. రామచంద్రా! భర్తగారు నాకొఱ కెదురుచూచుచుందురు. పోయివచ్చెద నా కనుజ్ఞ నిమ్ము. (నిష్క్రమించును.)

రాము:—(సిగ్గుతో) మిత్రులారా! మీ మొగముల కెట్లు చూతును?

పింగ:—వయస్యా! ఎంతమాటంటివి? అది యంతయు మారీచుని మాయావిలాసము లెమ్ము.

రాము:—(అంతటనుఁ గలయఁ జూచి) దినయావనారంభము విజృంభించుచున్నది. కావున స్కంధావారమునకుఁ బోవుదము రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది శ్రీ వెంకటపార్థసారథి కవి ప్రణీతం బయిన విచిత్రరాఘవమున ద్వితీయాంకము.



శ్రీ ర స్తు.

# విచిత్రరాఘవము

## తృతీయాంకము

---

దృశ్యము:—లంకాపట్టణములో నొక రాజవీధి.

(అంత నొక గంధర్వుఁడు ప్రవేశించును.)

గంధ:— తనవారందఱుఁ బడిపోవుట చూచి లంకేశ్వరుఁ డేమి చేయుచుండెనో తెలిసికొని రమ్మని నిఖిల సుర చక్ర చూడామణి కిరణ పుంజ కింజల్కిత చరణారవిందుఁ డగు దేవేంద్రుఁ డాజ్ఞాపించెను. రాక్షస వేషమున నుండుటచే నన్యదుష్కరం బగు నీ రాజధానిం బ్రవేశింపఁ గల్గితిని. (ముందునకుఁ జూచి) ఆ రక్కసి యెవ్వతెయో యిటే వచ్చుచున్నట్లున్నది.

రాక్ష:— (ప్రవేశించి చూచి) ఈతఁడు కరాళుఁడే యగునా యేమి చెపుమా? (సమీపించి) అయ్యా! నీవు కరాళుఁడవేనా?

గంధ:—(తనలో) సంభాషణమున కీమెయే స్వయముగా దారిఁ జూపుచున్నది. (ప్రకా) ఔను. కరాళుఁడనే.

రాక్ష:—ఏమయ్యా, నీవు మనిషివా? పాషాణమవా? నీ భార్య గృహముఖ నీవు రాముని చేతిలో మరణించితి వని తొమ్ము బాదుకొనుచు నేడ్చుచున్నది.

గంధ:—(తనలో) కరాళుని భార్యయా! సరే. (ప్రకా) ఆమె కీవార్త నెవరు చెప్పిరి.

రాక్ష:—మొన్న మారీచుఁ డిచటికి వచ్చి లంకేశ్వరులు కనఁబడకుండుటచే ప్రహస్తుఁడు మొదలగు మంత్రులతోఁ దాటకాసుబాహుకరాళుల చావును చెప్పి విచారముతో గోకర్ణక్షేత్రమునఁ దపస్సు చేసికొనుటకు వెళ్లెను.

గంధ:—లంకేశ్వరులు పట్టణమున లేరా?

రాక్ష:—లేరు. లేరు. అందుచేతనే విద్యుజ్జిహ్వుని యింటికివెళ్ళి సంగతిఁ దెలిసికొని రమ్మని మండోదరి పంపుటచే వెళ్ళి వచ్చుచున్నాను. తీరా అక్కడికి వెళ్ళునరికి విద్యుజ్జిహ్వుఁ డింటలేఁడు. అతనిభార్య యేమేమోసోది వెళ్ళఁబోసినది.

గంధ:—ఆమె యేమని చెప్పినది?

రాక్ష:—అది యొక రహస్య విషయము లెమ్ము. (ఇంచుక యాగి) వినను నిచ్చట జనకపక్షపాతు లెవరున్నారు? చెప్పెద వినుము. సీతను పెండ్లియాడుటకై

మన మహారాజు రామవేషమున మిథిలా నగరమునకు దయచేసెను. విద్యుజ్జిహ్వుఁడు కౌశిక వేషమును సారణుఁడు లక్ష్మణ వేషమును వేసిరఁట! మఱల నెక్కడనైనఁ జెప్పెదవు సుమా! కొంప లంటుకొనును.

గంధ:—(తనలో) మెడకాయ మీఁద తలకాయ కలవారలకుఁ దప్ప నితరులకుఁ జెప్పను. (ప్రకా) చక్కని పని చేసినారు. సీతకు రామునియందుఁ బ్రేమ యని యందఱకుఁ దెలిసినదే.

రాక్షి:—నీవు కరాళుఁడవే కాదా? (సంతోషముతో) నేను ముందుగా వెళ్ళి నీ భార్యకీ సంతోషవార్త చెప్పి పారితోషికము గ్రహించెద.

గంధ:—ఓసి వెఱ్ఱిదానా! నీ వేదో కరాళుఁడవా యని యడుగుటచేఁ గాదనుటేల యని యా నంటిని. అంతియే కాని నేను కరాళుఁడను కాను.

రాక్ష:—ఐనచోఁ గరాళునిగతి నే నన్నంత యైనట్లేనా?

గంధ:—అందులో సందేహ మేమి?

రాక్ష:—నా కోర్కి వ్యర్థమైనది. ఎందుకు నాకీ తడిపిలేని బేరము? మండోదరి యొద్ది కేగెద. (వెళ్ళును.)

గంధ:—నేనును ముందుగా నీ వృత్తాంతము జనకున కెఱింగించి పిదప దేవేంద్రుని యొద్దికిఁ బోయెదను.

(నిష్క్రమించును.)

ఇది విష్కంభము.

దృశ్యము: — విశ్వామిత్రుని యాశ్రమములో జనకసభాస్థానము:
(అంతట జనకశతానందులు ప్రవేశింతురు.)

జనకుఁడు:—ఆర్యా! శతానందా!

చ॥ తెలిసిన రావణుం డడిగితీరును; రెండవకంటివానికిం
దెలియకయుండఁ గార్యమును దీరిచి యెట్టులొ యొద్దు కెక్కఁగా
వలయును; పైనఁ గౌశికుఁడు పట్టుగనుండెనుగాని యేలకో
బలితపుభీతి చేరి నను బట్టి పలార్చుచునున్న దక్కటా!

శతా:—రాజా! విచారింపకుము. కౌశికుని ప్రభావము నీ వెఱుంగనిదా?

జన:—సరే! ఏదో విధమున మనము సీతారాముల పాణిగ్రహణము నిర్వర్తించెద మను కొనుఁడు ఇప్పుడు కాకపోయినఁ గొంత కాలమునకైన నీ సంగతి దశాననుని చెవిం బడకుండునా? అప్పుడైన నీ ప్రేమదంపతులను పొట్టను బెట్టుకొనకుండ నాతఁడు నిద్రపోవునా?

శతా:—మీ రన్నట్లే జరిగినయెడల నిఁకఁ గౌశికుని ప్రతిభ యేమి కనుపడును? ఆతఁడు రామభద్రునకు జృంభకాది మహాస్త్రముల నొసంగి దుర్ధర్ష వీర్య ప్రకర్షునిగ నొనర్చును. (అంతటఁ గౌశిక లక్ష్మణ వేషముల విద్యుజ్జిహ్వుఁడును సారణుఁడును వెంట వచ్చుచుండ రామ వేషమున రావణుఁడు ప్రవేశించును.)

రావ:—సారణా! ఇదే జనకసభాస్థానము సమీపించితిమి.

గీ॥ సొగసు లీనెడు బంగరు మొగిలి రేకు
వడువున విలాసముల జాలఁ బరిమళించు
జానకినిఁ జూచి యిచట నేఁడైనఁ దృష్టి
నొందవచ్చు నిర్వదికన్ను లున్నఫలము!

సార:—కేవలముఁ జూడఁ గలుగుటయే కాదు.

ఉ॥ రామునిబోలి యచ్చముగ రాణ జెలంగగ నీలనీరద
శ్యాముఁడవౌచునున్న నిను నారసినంతనె యల్ల నిక్కమౌ
రాముఁడెయంచుఁ బ్రేమ జలరాశి విలాస తరంగమాలలం
దా మదిరాక్షి యాముగుద హాయిగ నుయ్యెల లూపకుండునే?

(పరిక్రమింతురు.)

ప్రతీహారి:—(ప్రవేశించి) జయము జయము మహారాజుగారికి! పూజ్యులగు విశ్వామిత్రులు రామలక్ష్మణులతో దయచేయుచున్నారు.

జన:—(సంతోషముతో) మహాత్మా! మన మెదురేగి యానుషంగిక త్రిశంకవలోక నూతన వరమిచ్చి యగు విశ్వామిత్రునిఁ గాకుత్స్థకులతిలకాయమాను లగు నా రామలక్ష్మణులతో నిచ్చటికిఁ దోడ్కొని వత్తము.

శతా:—చిత్తము. (ఆసనములనుండి యిరువురును దిగుదురు.)

జన:—దేవా! సీరధ్వజుఁడను నమస్కరించుచున్నాను.

విద్యు:—మహారాజా! నీకు శుభమగుఁ గాక!

సార:—(జనాంతికముగా) దేవా! తమవంటి మహానుభావు లల్లుఁ డగుచుండ శుభముల కేమి కొదువ?

రావ:—(సంతోషముతో) ఔ నట్టే!

(విద్యుజ్జిహ్వుఁడు జనకునకు నమస్కరింపు మని కనుసన్న జేయును.)

రావ:—(జనాంతికముగా) సారణా!

ఉ॥ నా దయఁగోరి యెప్పుడుఁ బ్రణామమునల్పుఁగ నిల్చియుందు రిం
ద్రాదులు, నింతయేల? ప్రణయవ్యసనంబున నుండిగూడ మం
దోదరికైన మ్రొక్కఁడనహో! ఇఁక నియ్యెడ నెవ్విధంబునన్
వాడుకు లొంగి వీని కభివాదనముం బొనరింతుఁ జెప్పుమా!

సార:—(తనలో) ఇంతటి దురహంకారికి జానకీలాభ మెట్లు కలుగును? (ప్రకా) దేవా! ప్రస్తుతవిరుద్ధము నాచరింపఁ దగదు.

రావ:—తండ్రీ! దాశరథిని నేను నమస్కరించుచున్నాను.

సార:—(అట్లే చెప్పును.)

జన:—కుఱ్ఱలారా! దీర్ఘాయుష్మంతులు కండు. తాపసోత్తమా! ఈ యాసన మలంకరింపుఁడు. రామ లక్ష్మణులారా! మీరు సుపవిష్టులు కండు. (అందఱుఁ గూర్చుండుదురు).

శతా:—దేవా! ఒడ్డుపొడుగులందును, చేష్టితములందు నొకరి కొకరు సమానముగ నున్న వీరిలో రాముఁ డెవఁడు? లక్ష్మణుఁ డెవ్వఁడు?

విద్యు:—(తనలో) ఒక్కఁడునుఁ గాఁడు. (ప్రకా) నవాంబుద శ్యామల కోమలుం డగు నీతఁడు రామచంద్రుఁడు. అతని ప్రక్క బదియారువ వన్నె బంగరుం బురుడించు మేను గల యాతఁడు లక్ష్మణుఁడు.

రావ:—(జనాంతికముగా) సారణా! సీతను బిలిపించుటకు జనకుఁ డింకను నాలస్యము చేయుచున్నాఁ డేమి?

సార:—(తనలో) మూర్ఖ జన మూర్ధన్యుఁ డగు నీతని కేమి యీ తొందఱ? జనకుని దర్శించి క్షణమైననుఁ గాలేదే? (జనాంతికముగా) ఒక్కనిమిష మోపిక పట్టుము.

శతా:—పాపము! పుత్రులకొఱ కెంత కలవరించెను దశరథుఁడు.

జన:—

చ॥ అఱువదివేల వత్సరము లైనవి పుత్రుల చేతిమీఁదుగాఁ
బరమపదంబుఁ బోవఁగల భాగ్యము లేదని కుందువాఁడు పం
క్తిరథుఁ డనారతం, బతనికిన్ జనియించిరి, నేఁటికీ సుతుల్
సరసులు, సత్యవిక్రములు, సానలఁదీరిన జాతిరత్నముల్.

విద్యు:—ఔ నట్లే.

రావ:—(జనాంతికముగా) సారణా! జానకినిఁ బరిణయ మాడుదునని చంకలు కొట్టుచున్నాము గాని తాటక మొదలగువారు కౌశికుని యాగమనమును నిరోధింపఁజాలిరో లేదో యని భయం బొదవుచున్నది.

సార:—అట్లెన్నటికిని సంభవింపదు.

జన:—కుశికనందనా!

ఉ॥ వీనులవిందుగాఁగ మును వింటిని పంక్తిరథుండు వీరలన్
సూనులఁగాంచెనం; చిపుడు చూచితిఁ; గన్నులపండువయ్యె; మా
జానకి రామభద్రున కొసంగితినేని గృహంబు నిత్యక
ల్యాణము పచ్చతోరణమునై విలసిల్లు నికం బవిత్రమై.

విద్యు:—మహారాజా! అదృష్టమనిన నీదే యదృష్టము. అనుమానించిన ప్రాణగొడ్డములన్నియుఁ దప్పి నిర్విఘ్నముగా వివాహము నెఱవేర్చుకొన నుంటివి.

జన:—అంతయు దేవరవారి ప్రభావమే. ఈ వివాహమున దాతయుఁ బ్రతిగృహీతయు మీరేకదా? కావున నిఁక నాలస్యమేల? "శుభస్యశీఘ్ర"మ్మని మీరు యజ్ఞదీక్ష నూనుడు. మేమును వివాహమంగళార్థముల నారంభింతుము.

విద్యు:—(తనలో) ఇది యొక పుట్టిమునుక వచ్చినదే! కానిమ్ము. విశ్వామిత్రుఁడు నిశాచరులకుఁ జిక్కనచో మావని నిమ్మకాయవాటమే. లేకున్నఁ దిరస్కరిణీ విద్యచే నంతర్ధానము నందెదము.

శతా:—రాజా! మన యూర్మిళనుగూడ లక్ష్మణున కిచ్చిన బాగుండును.

విద్యు:—(జనాంతికముగా) సారణా! నీవేదో నక్కను ద్రొక్కియే వచ్చితివి. నా రాకయే నిష్ఫలము.

సార:—(జనాంతికముగా) కాదు కాదు. కౌశికుని సుతులతోను, శిష్యులతోను, ఆవుల తోడనుఁ గూడుకొని జరుపు నీయజ్ఞమం దాతని గృహిణియే నీకు భార్య కాఁగలదు.

విద్యు:—(జనాంతికముగా) సారణా! ఒక మునలిముండకు మగఁనిజేసి న న్నాటలు పట్టించుచున్నావా?

జన:— గౌతమనందనా! అంతియేగాదు, నా తమ్ముఁడగు కుశధ్వజుని కుమార్తెలను మా మాండవీశ్రుతకీర్తులనుగూడ భరతశత్రుఘ్నుల కిచ్చెదము.

రావ:—(జనాంతికముగా) సారణా! భరతశత్రుఘ్నుల వేషములతో నింక నిర్వురను వెంటఁబెట్టుకొని రావలసినది. చాల పొరపాటు చేసితిమి.

సార:—(జనాంతికముగా) నేను ముందే చెప్పితిని విశ్వామిత్రుఁడు దశరథుని సపుత్రదారముగాఁ దీసికొనివచ్చుటకు వెళ్ళెనని. విద్యుజ్జిహ్వుఁడు మాత్ర మీపని చేసినవాఁడు కాఁడు.

రావ:—(జనాంతికముగా) రానిమ్ము. ఈ మూర్ఖుఁడు జానకి నెంతసేపటికినిఁ బిలిపింపకున్నాఁడు.

విద్యు:—జనకా! దశరథుఁడు సపరివారముగ మధ్యేమార్గమున విడిసియున్నవాఁడు.

జన:—ఎవఁడురా అక్కడ?

ప్రతీహారి—(ప్రవేశించి) దేవా! ఏమి యాజ్ఞ?

జన:—పూజ్యులగు కౌశికులకు నమస్కరింపఁ గన్యాజనముం దోడ్కొనిరమ్ము.

ప్రతీ:—చిత్తము. (నిష్క్రమించును.)

రావ:—దైవమే నాయందుఁ బక్షపాతముఁ జూపెను.

గీ॥ తీరుగా సాగి నను సిగ్గుతెరల నడుమ
నడఁగుచు మఱింత వింత యొయ్యార మంది
త ళుకు లీ చు ముందు బర్వులను వెట్టు
వాలుఁజూపుల ననుఁ దృప్తిపఱచు సీత!

(తెరలో)

మ॥ ఒనరంగాఁ గుశికాత్మజుండటుల విద్యుజ్జిహ్వుఁ డేతేర; ల
క్ష్మణవేషంబున సారణుం డనుసరింపంగా; న దేరీతి రా
మునిపాత్రన్ ధరియించి రావణుఁడు మిమ్ముం బుట్టలోఁ బెట్టి సీ
తను గొంపోవఁగవచ్చు; హెచ్చరికతోఁ దథ్యంబుఁ బాలింపుఁడీ!

రావ:—(జనాంతికముగా) ఎవరది, మన వృత్తాంతమును జనకునకు నివేదించుచున్నారు? మన సంగతి రెండవ కంటివానికిఁ దెలియదుగదా!

సార:—(జనాంతికముగా) ఏమో! ఇది చాల నాశ్చర్యముగా నున్నది.

విద్యు:—(తనలో) ఈ వృత్తాంతము నా భార్యకుఁ దక్క నెవ్వరికినిఁ దెలియఁ గూడదే? ఈ సంగతి వెళ్ళఁబెట్టితినా నీ నోటిలో నువుగింజయైన దాగదని వీ రిద్దరు నన్నుఁ దలవాచునట్లు చీవాట్లు పెట్టెదరు

సార:—ఆర్యా! శతానంద! ఇట్లు పలుకుచున్న యీ దుర్మదు నవశ్యము విచారింప వలెను.

శతా:—(తనలో) ఏమిది! రావణసారణవిద్యుజ్జిహ్వులు రామలక్ష్మణకౌశికవేషముల నిచ్చటికి వచ్చిరా? (ప్రకా) లక్ష్మణా! విచారించెదము.

జన:—(విచారముతోఁ దనలో)

ఉ॥ జానకివాంఛితంబు గొనసాగఁగ జేయఁగవచ్చెఁ గౌశికుం
డే నిఁకఁ గొండనెక్కినటులే యనుకొంటిని గాని యింతలో
మానవిపుట్టె మున్క నను మాపునటంచుఁ దలంపనైతి నీ!
తా నొకటిం దలంచుకొన దైవము వేఱొకటిం దలంచెడిన్॥

(ప్రకా) ఎవఁడురా అక్కడ?

ప్రతీహారి:—(ప్రవేశించి) దేవా! ఏమిసెలవు?

జన:—ఇట్లు పలికినయాతఁ డెవ్వఁడో విచారింపుము.

ప్రతీ:—దేవా! ఇంకను విచారించు టెందులకు? ఒక దివ్యపురుషుం డెవ్వఁడో యాకసమున నిల్చి యీ వాక్యములు పలికి యదృశ్యుఁడైనాఁడు. అపర రామ లక్ష్మణులతో నింకొక కౌశికుఁ డల్లంత వచ్చుచున్నాఁడు.

జన:—శతానందా! ఎట్లిది? చాలవింతగా నున్నదే?

శతా:—(జనాంతికముగా) ఇంద్రదూతయే యిట్లు చెప్పియుండవచ్చును. కావున వచ్చినవారిని రాఁబోవువారినిఁ బరిశీలించి క్రమముగా స్వరూపనిర్ధారణము చేయుదము. (ప్రకా) కుశికనందనా? ఎట్లిది?

విద్యు:—(తనలో) దొంగలు గన్నీవానికింబలె మేము కౌశికునకుఁ జిక్కిపోయితిమి. (ప్రకా) మావేషముల ధరించిన రాక్షసులను రానిండు. మేము వేఱొకచోటి కేగుదుము.

రావ.—(జనాంతికముగా) సారణా! ఆ క్షత్రియార్భకుఁడు తాటకాదుల నందఱఁ జంపివైచెనా?

సార:—(జనాంతికముగా) అట్లెన్నటికిని జరిగియుండదు. ఇది నిజమేయైనచో రామునిముందు మన శక్తి యెంతమాత్రముఁ బనిచేయదు.

విద్యు:—(తనలో) తేలుకుట్టిన దొంగలవలె మిన్నకుండక వీరిరువు రేమేమో గుజ గుజలు పోవుచున్నారు.

రావ:—(జనాంతికముగా) విద్యుజ్జిహ్వా! మన మిప్పుడు చేయవలసినపని యేమి?

విద్యు:—(జనాంతికముగా) తిరస్కారిణీ విద్యచేఁ దిరోహితులమైయుండి సమయానుసారముగఁ బ్రవర్తింతము.

రావ:—(జనాంతికముగా) లెస్సఁ బల్కితివి.

జన:—(జనాంతికముగా) శతానందా! ఆకులపాటుం జెందిన వారివలె వీరు పరస్పరము మంత్రించుకొనుచున్నారు. వీరే రాక్షసులేమో?

శతా:—(జనాంతికముగా) నేను నట్లే తలఁచుచున్నాను.

విద్యు:—జనకరాజా! దీనికింత విచారణం బేల? మేము వేటాకచోటి కేగెదమని చెప్పియేయుంటిమిగాదా?

జన:—కానిండు (లేచి మార్గము చూపును.)

(రావణుఁడు మొదలగువారు నిష్క్రమించి తిరస్కారిణీ తిరోహితులై నాతి దూరమునఁ బ్రవేశింతురు. రామలక్ష్మణవిశ్వామిత్రులునుఁ బ్రవేశింతురు.)

కౌశి:—రామలక్ష్మణులారా! జనకమహారాజునుసమీపించుచున్నాము. ఈతఁడు సామాన్యుఁడు కాఁడు. ఉపనిషద్గురుండగు యాజ్ఞవల్క్యునిప్రియశిష్యుఁడు. పెద్దలగు యోగీంద్రులచేఁగూడఁ బూజింపఁ బడువాఁడు.

లక్ష్మ:—మహాత్మా! ఈతని యొద్ద నాఁగేటి చాలున యజ్ఞభూమినుండి పుట్టిన సీత యను కన్యక యున్నదఁట కాదా?

కౌశి:—ఔను.

రాము:—(తనలో)

చ॥ జనకజ నాఁడుచిచ్చుటికి చచ్చుటయంతయు వట్టిమాయగాఁ
గనులకుఁ గట్టినట్టులుగ గన్పడుచున్న నకారణంబుగా
మనమున నప్పుడప్పు డనుమానపుజాడ్యము గల్గుచున్న దీ
దినమున జానకిం గఱవుతీఱఁగఁ జూచుకొనంగనౌ నిటన్॥

(ప్రకా) ఇంకొక చిత్రము వినుచుందుము. సకలసురాసురులకును దురారోపమగు శివధను స్సీతని యింట నెల్లప్పుడుఁ బూజింపఁబడు చుండునఁట!

కౌశి:—(నవ్వుచు) అదియునుఁ గలదు.

శతా:—కౌశిక మునీంద్రుఁడు రామలక్ష్మణులతో దయచేయుచున్నాఁడు.

జన:—నేఁడు సుదినము.

(యథోచితముగా వారల నెదుర్కొని యాసనాసీనులం జేయును.)

శతా:—(తనలో) వీరు రాక్షసులే యగుదురుగాక! ఇట్లు పలికెద. (ప్రకా) అదృష్ట

వశమున రామలక్ష్మణులతోఁగూడఁ గౌశికులు సురక్షితముగ వచ్చియున్నారు

జన:—(తనలో) నేనును శతానందు ననుసరించి పలుకు చుందెద. (ప్రకా) మహాత్మ! క్షేమమునఁ బోయి లాభమున వచ్చితిరి.

ఉ॥ మావలెఁ బుత్రశోకమున గ్రుగ్గుదుగా కని మౌని తిట్టఁగా
నీవిధినైననుం గొడుకు లేర్పడవచ్చు నటంచుఁ జాల మో
దావృతుఁడయ్యెఁ బంక్తిరథుఁ డాతనికిన్ జనియించినార లీ
పావనమూర్తులైన పసిపాపలు నల్గురు వీరు నేఁటికిన్॥

రావ:—ఇతఁడు వీరిని నిజమగు వారనియే యెంచి యిట్లనుచున్నాఁడా యేమి?

సార:—మనలఁ గూడ నిట్లేయడిగి యుండెను గదా?

కౌశి:—అది యట్లుండుఁగాక! ఇది వినుఁడు.

రావ:—దురాత్ముఁడగు కౌశికుఁ డేమి సెప్పునో?

విద్యు:—బహుశః, దారిలో నడ్డగించిన మనవారినిఁ గూర్చియే!

సార:—వారిని నిగ్రహించియుండని దీతఁ డియ్యెడ కెట్లు రాఁగలుగును?

కౌశి:—నే నొక యజ్ఞము చేయఁబోవుచుంటి నని దశరథుని సపుత్రదారముగఁ బ్రయాణము చేసి తీసికొని వచ్చుచుండ మార్గమధ్యమునఁ దాటక తన కనుల నెత్తురు టేరుల బారించుచు మమ్ము నడ్డగించెను.

రావ:—(సంతోషముతో) మంచిపని జరిగినది.

విద్యు:—పైసంగతిఁగూడ విని మాట్లాడుఁడు.

రావ:—హర్షపారవశ్యముచే వీరి రాకనే మఱచిపోయితిని.

కౌశి:—

ఉ॥ ఆఁడుదియౌటచే దశరథాత్మజుఁ డాయమ నుక్కడంపఁ జే
యాడక మిన్నకుండె నటులైనను చేతిశరంబె చాపమున్
వీడి తనంత నామెపయి బట్టుటికెం గడుఁ జిత్రమయ్యె న
ప్పోఁడిమి నామె మస్తకము భూమిపయింబడెఁ దక్షణంబునన్.

రావ:— ఈ మునిముచ్చు క్షత్రియార్భకునియందు లేని మాహాత్మ్యము నారోపించి గోరంతలు కొండంతలు చేయుచున్నాఁడు.

సార:—హా తాటకా! అబలయని యెఱింగియు నీతఁడు నిన్ను విడువఁడాయెఁగా!

జన—(జనాంతికముగా) శతానందా! తాము ధరించిన వేషములను దృఢతరముగాఁ జేసికొనుట కీ రక్కసుఁ డిట్టి యభూతకల్పన నల్లుచున్నాఁడు.

శతా:—(జనాంతికముగా) తక్కినదిగూడ విందము.

జన:—ఆర్యా! ముక్కువచ్చలారని యీ పసికూన యెక్కడ! వేయి యేనుఁగుల బలముగల యా తాటక యెక్కడ?

రావ:—జనకుఁడు బాగుగ నధిక్షేపించెను.

శతా:—దైవయోగముచే నెవ్వరికిని దుష్కరమనునది యుండదు. మహాపర్వత మొక చిన్న యద్దమున నిముడుటలేదా?

విద్యు:—ఈ శతానందహతకుఁడు దానిని సమర్థించుచున్నాఁడు.

రావ:—ఆపై యనుచరు లేమైరో!

జన:—తరువాతఁ దరువాత.

కౌశి:—పిమ్మట సుబాహుప్రభృతులు రామునిధాటి తాగలేకపోయిరి.

రావ:—వారు తాటకావధను సహించి మిన్నకుండిరా?

సార:—వారలకు నా మొగతిరయే పట్టియుండును.

కౌశి:—రాముఁ డాగ్నేయాస్త్రముం బ్రయోగించియుఁ బ్రయోగించకమునుపే సుబాహుఁడు కృతాంతనితాంతమున కతిథియయ్యెను.

శతా:—(జనాంతికముగా) ఇట్లుండగా వీరి నేమిచేయుదము?

జన:—(జనాంతికముగా) వీర్యశుల్కము నొకదాని నేర్పాటు చేయుదము.

శతా:—(జనాంతికముగా) ఏమని?

జన:—(జనాంతికముగా) శివధనుస్సు నెక్కుడుటయే!

శతా:—(నవ్వి జనాంతికముగా) కైలాసపర్వతమును గడ్డిపోచగ నాడించిన రావణున కీ శివచాపము నెక్కువెట్టు టొక లెక్కయా?

జన:—(జనాంతికముగా) సిద్ధ చారణ గంధర్వ దేవ దానవులయం దెవ్వరికి నీ చాపము నెక్కువెట్ట సాధ్యము గాదు. ఇది నిజము.

శతా:—(జనాంతికముగా) అట్లైన సరే.

విద్యు:—ఏమిది! కౌశికుఁ డందఱి చావును చల్లఁగఁ జెప్పివైచినాఁడే!

సార:—మారీచుని మాయాకౌశల్య మే మంటలో మ్రగ్గిపోయినదో!

కౌశి:—వాయువ్యాస్త్రముచే మారీచుఁడు పైకిఁ జెండువలె నెగిరి పోయెను. చచ్చెనో బ్రతికెనో మాత్రము తెలియ లేదు.

రావ:—(పండ్లు పటపటఁ గొఱుకుచు) ఇంక నీ క్షత్రియబ్రహ్మచారిని క్షమింప రాదు.

గీ॥ అస్మదీయ మహోగ్ర కోపానలమున
భస్మ మొనరించివైతు దుర్భరుని వీని

నరయ మొలత్రాడు గట్టిన పురుషులెవ్వ
రడ్డువత్తురొ! చూచెద నదియుఁగూడ! (పోఁబోవును.)

విద్యు:—(నివారించి) ఒక్క గోటిపోటుచేతనే మరణించు నీ మానవార్భకునిపై నింత సంరంభమేల?

శతా:—రఘుకుమారుఁడు మహాప్రతిభావంతుఁడు.

లక్ష్మ:—కనుకనే పూజ్యులగు కౌశికులు జృంభకాద్యస్త్రముల ననుగ్రహించిరి.

విద్యు:—మహారాజా! లక్ష్మణుని పలుకులు వింటివా?

రావ:—అగుఁగాక! మనకేమి భయము?

సార:—మొదటినుండియుఁ గౌశికుఁడే మనదారియందు సర్పమువలె నున్నాఁడు.

కౌశి:—(తనలో) ఈ జనకశతానందు లేలొకో మమ్ము వేరువిధముగఁ దలంచి యూరకనీళ్లు నమలుచు మాటాడుచున్నారు. మాయావులగు రక్కసులు వీరిని మున్దుగనే వంచించి యుండరుగదా! (ప్రకా) జనకా! శతానందా! మీరేదో చెప్పఁదలంచినట్లున్నది.

(జనకుఁడు శతానందునకు సంజ్ఞచేయును.)

ఉ॥ మే మొక బాసఁజేసితిమి, మీరునుఁ జూడుడు; రాజపుత్రులం
దే మహనీయుఁ డెక్కిడునొ యీ గిరిజాధిపువిల్లు వాని మా
భూమిజ పెండ్లియాడును ప్రమోదము వెల్లిగొనంగ దాన మా
కామితమున్ ఫలించు సముఖంబున నేటికి రాయబారముల్?

కౌశి:—(నవ్వి) మాయందును మీకు విశ్వాసము లేదా? ఎక్కువెట్టుటకు శంకర శరాసనముం దెప్పింపుఁడు.

జన:—శతానందా! మీ రేగి యా శివధనుస్సును పట్టించుకొని రండు.

శతా:—చిత్తము. (నిష్క్రమించును.)

రావ:—కైలాసపర్వతము నుక్కుఁ బేల నెత్తిన నాకే సాధ్యపడని యీ శివధనుస్సు నీ బాలుఁ డెక్కువెట్టునా?

విద్యు:—ఈ మూర్ఖజనకుఁడు ముందువెనుక లాలోచింపకయే యిట్టి ఘోరప్రతిజ్ఞను జేసినాఁడే! ఈ ధనుస్సు నెక్కువెట్టు సామర్థ్యముగలవార లీ ముల్లోకములం దును లేరు.

రావ:—హా వరాక్షీ! జానకీ!

ఉ॥ మిత్రుని కూఁతు రంచు బలిమిం గొనిపోవను; చూడ లేవు నా
పాత్రత మానవార్భకునిపై నిఁ బ్రియంపడి; వేసినాఁడఁ ద

క్షాత్రయు నైన శుల్క మిది దారుణమయ్యెను నాకె; ఇంక నీ
క్షత్రియబాలు రేమిటికి? కామిని! కన్నెగ నిల్చిపోదువా?

శతా:—(ప్రవేశించి) మహారాజా! శివధనుస్సు నిదే. తెచ్చియున్నారు.

కౌశి:— రామభద్రా! దీనినిఁ జూడుము.

రాము:—గురుజనుల యాజ్ఞ. (లేచి శరాసనము సమీపించును.)

రావ:—ఏమిది? ఇతఁ డేమాత్రము జంకు లేక యీ చాపము సమీపించుచున్నాఁడు!

విద్యు:—జానకి నీతఁడే పరిణయ మాడునేమో!

(అంతట సీత, ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తి ప్రవేశింతురు.)

సీత:—వత్సలారా! పూజ్యు లగు కౌశికులు వచ్చియున్నవా రఁట!

రాము:—(తనలో)

గీ॥ శారికాలాప మేమొ? నా శ్రవణ పుటము
నం దమృతధారలను నించు నదియుఁగాక
నిద్ది మరునకు నను బట్టియిచ్చుచుండె
బళిర! నా జానకీముగ్ధవచన మేమొ?

(సీతారాములు లొండొరులఁ జూచుకొందురు.)

రాము:—(తనలో) ఆహా! ఈమెయే జానకి!

గీ॥ నేను జూడని యప్పుడు తాను జూచు
నేను జూచిన యప్పుడు మానివైచు
నీ రమణి యేమియేమియో నోరులేని
ప్రేమవార్తల నాకుఁ బంపించుచుండె.

ఈమెను గఉవుతీఉఁ గాఁగిలించుకొందునా? (విచారించి) శంకరశరాసనము నెక్కువెట్టినఁగాని యియ్యది సాధ్యపడదు. (ధనుస్సును సమీపించును.)

సీత:—(తనలో)

మ॥ కనుపించుం బ్రియుఁ డల్లదే! కల యొకో! కా దిప్డు నిక్కంబుగాఁ
గనుచుంటిఁ; సమయం బిదే; త్వరగ నా కౌఁగింట బంధించివై
తున? నమ్మంజన దీతనిఁ; వెనుకటుల్ తూలించితాఁ బారిపో
వునొ యేమో గద! పాడుసిగ్గిపుడె యేపుం జూపుచుండెం గటా!

ఊర్మిళ:—మాండవీ! జానకి యే మనుచున్నదో వింటివా?

మాండ:—అక్కా! కౌశికమహర్షివెంట నిరువురు రాజపుత్రులు గూడ వచ్చి రఁట కాదా?

సీత:—ఔను.

మాండ:—వారిలో నొకఁడు మన కన్యాజనమం దొక్కతెను బెండ్లాడునని వింటిని.

సీత:—(అసూయతో) మాండవీ! నాతో మాటాడకుము. (చెక్కిలిపైఁ గొట్టును.)

ఊర్మి:—(నవ్వి) సీతా! మాండవి చెప్పిన దానిని నీపైననే పెట్టుకొందు వేల? గున్నడి కాయల దొంగ యన్న బుజములు తడుముకొన్నాఁడట!

సీత:—ఊర్మిళా! దూరముగ నుండుము. నీ వెప్పుడు నేవో యసంబద్ధవాక్యముల నాడుచుందువు.

శ్రుత:—జానకీ! మా కందఱకు రాని కోపము నీకే వచ్చు టెందులకు? ఏదీచెప్పుము స్వప్నమందు మన్మథమన్మథుం డగు నొకానొక రాకొమరుం జూచి వేసంగిని సెలయేరు వలె దినదినముఁ గృశించుచున్న ముగుద యెవ్వతెయో? మనోహరుఁ డగు వసంతునితో సయ్యాటలాడుచున్న పూఁదోటయందుఁ, గుచభారనమిత యగు కోమలియుం బోలెఁ బండిన ఫలములచే వంగుచున్న లేతమామిడిచెట్ల చాటున, బ్రియుని సందిట రహించెడు విలాసినియుం బలె నరఁటిచెట్లచేఁ జుట్టఁబడి సొగసు లీనెడు మాధవీమంటపమున, నొంటిపాటునఁ బూలసెజ్జపైఁ దీరని విరహవేదనచే నసు రుసురగుచుఁ జెలిమికత్తియల యూరడింపులచే నిన్ని దినములు వెళ్ళించిన కామిని యెవ్వతెయో? నీ సంగతి యంతయు నేఁటి యుదయమున నొక చెలికత్తె చెప్పినది లెమ్ము.

ఊర్మి:—చెల్లీ! చెప్పుము చెప్పుము, చెలికత్తె యే మని చెప్పినది?

సీత:—చెలికత్తె లేదు గిలికత్తెలేదు. ఇవి శ్రుతకీర్తిమాటలే.

శ్రుత:—మన సీతకు రాముఁ డను వన్నెకాఁ డొకఁడు కలలోఁ గనుపించి యేమేమో యచ్చికబుచ్చికలు చేసినాఁడఁట! అప్పటినుండియు జానకి పై విధమున నాతనికై కలవరించుచున్నదఁట!

ఊర్మి:—ఇదియా కథ!

మాండవి:—జానకీ! ఎంతటి నంగనాచివే?

సీత:—(సిగ్గుతోఁ దనలో) వీరికి నా గుట్టంతయుఁ దెలిసినది. ఇప్పు డేది దారి? (ప్రకా) సోదరీమణులారా! ఊరక నన్ను నిందింతు రేల? పరిహాసములకుఁ బుట్టినిల్లగు మా శీలవతి శ్రుతకీర్తి చిన్నపిల్ల గదా యని " సీత ఇట్లున్నది యట్లున్నది"యని యేమోమో నేరములు చెప్పి యుండవచ్చును.

మాండ:—(ముందునకుఁ జూచి) యేమిది! మనము నిత్యముఁ బూజింపుచున్న శివధను వ్సిచ్చటి కెందులకు వచ్చినదో? దాని సమీపముననే విశాలరీర

ర్భాయచేఁ బగఁటివేళయందే యప్పటికప్పుడు వికసించిన నల్లగల్వల నెల్ల యెడల వెదజల్లుచు నిల్చియున్న యీ రాకుమారుఁ డెవ్వఁడో!

కౌశి:—రామభద్రా! ఇంకను ఆలసించెద వేల? ఈ హరచాపము నెక్కువెట్టి జనకుని ముద్దు చెల్లింపుము.

సీత:—(ఆయాసముతోఁ దనలో) శంకరశరాసన మెక్కువెట్టిన గాని యీతఁడు లభిపఁడుగా! (ఇంచుకయాగి) రామా! కొంచెము తాళుము. రెండుమూఁడు నిముసము లోపికపట్టుము! సాహసింపకుము. తప్పిపోవుదు వేమో గదా! నీ చెలిమిఁ బోగొట్టుకొందును! కొంచెము తాళుము. నిన్నుఁ బోఁగొట్టుకొన నని ప్రేమగాదు—మ ఉదిరియో నాకుఁ జెప్పుచున్నది. అనిష్టత యిట్లు బోధింప దని నీకునుఁ దెలియును. నా యభిప్రాయము నీకుఁ దెలియవచ్చినదో లేదో! అబ్బా! ప్రేమవిషయమున నబలల కూహ యుండును గాని నాలుక యుండదు. శివధనుస్సు నెత్తు మార్గముఁ జెప్పనిమ్ము. మార్గ మేమున్న దని చెప్పుదును? అయ్యో! నీవు నా కింక దక్కవా? మనోహరా! ఇటు చూడుము. నీ వాలుజూపులు నన్నుఁ బైకొని రెండుగా భాగించి వైచినవి. ఒక యర్థభాగము నీది. రెండవది - నాది - నీయదియే! నా యర్థభాగము - నాది యైనచో నీయదియే! కనుక నంతయు నీదే! ఈ మాయదారికాలము యజమానులకును వారి స్వత్వములకును మధ్య నడ్డుతగులు చున్నది. కావున నీది యైనప్పటికిని-నీది కాదు-నీది యని రుజువుపఱచుకొనుము. దూషింపఁదగినది యదృష్టము. నేను కాదు. (ఇంచుక యాగి) అక్కటా! జనకు లెట్టి కట్టడి చేసిరి.

గీ॥ కమఠపృష్ఠకఠోర మీ కార్ముకంబు
మధురమూర్తి యితండు నా హృదయచోరుఁ
డెక్కువెట్టుట యెట్టులో యెఱుఁగ నన్ను
నితని కీయరు గాఁబోలు నేది దారి?

శతా:—మహారాజా! రఘుకుమారుని గాంభీర్యముఁ జూడుము.

కౌశి:—శివధనుస్సును దనదివలెనే యనాయాసముగ గ్రహించుచున్నాఁడు మా రాముఁడు.

లక్ష్మ:—గ్రహించుటయే గాదు. నారిని లాగుచునేయున్నాఁడు.

జన:—ఎక్కువెట్టుచునే యున్నాఁడు.

శతా:—(జనాంతికముగా) సీరధ్వజా! ఇంకను సందేహ మేల? ఈతఁడే కౌశికుఁడు. వీరలే రామలక్ష్మణులు. ముందు వచ్చినవారే రక్కసులు.

జన:—(జనాంతికముగా) కొ నట్లే తోఁచుచున్నది.

శత:—(జనాంతికముగా) అదృష్టవశమున మాయార్ణవమునుండి యైనను మనోరథార్ణవమునుండి వలె నుత్తీర్ణుల మైతిమి.

జన:—(ఆశ్చర్యముతో) శంకరశరాసనము భగ్నమాచున్నట్లున్నది.

విద్యు:—క్షత్రియకుమారుఁడు పరాక్రమశాలి!

సార:—విద్యుజ్జిహ్వా! ఏమి వర్ణించెదవు? ఈ కోదండముతోఁబాటు మన మహారాజు కోర్కులును భగ్నము లైనవి.

రావ:—ఇందు విద్యుజ్జిహ్వుని తప్పేమి?

ఉ॥ రాముఁడు రానె వచ్చె సుకరంబుగ విల్లును ద్రుంచె జానకీ
కామము నిండెఁ గౌశికుని కష్టములెల్ల ఫలించె నేను నా
రామునిపాత్ర వేసితిఁ, బరాభవ మయ్యె, ననర్ఘ మా యశ
శ్శ్రీ మురువారె నీ! వ్రతము చెడ్డను సౌఖ్యము కల్గదాయెఁగా!

గీ॥ తేలు కుట్టిన దొంగ నై తిని భవత్ప్ర
భాషితమ్ముల విని బుద్ధివచ్చె నింకఁ
జాలుఁజాలును వీరలఁ జంపి సీతఁ
గైకొనెద నెట్టు లడ్డునో కౌశికుండు?

(పోఁబోవును.)

విద్యు:—(అడ్డుపడి) దేవా! సాహసం బెప్పుడు నభ్యుదయకారణము కానేరదు. నామాట వినుఁడు. మన మిప్పటి కేగి జానకి లభించు నుపాయము మాల్యవత్ప్రముఖులతో నాలోచించి యట్లు నడుచుకొనుట మంచిది.

రావ:—సరే! మనము తిరిగి విమాన మెక్కి లంకకుఁ జేరుదము రండు. సీతాదర్శన కుతూహల మిఁకఁ జాలును. ఈమెను బలాత్కారముగ నెత్తికొనిపోవుటకు నిర్ధరించితిమి గదా! (రాక్షసులతో నిష్క్రమించును.)

జన:—రామభద్రా! రమ్ము రమ్ము.

గీ॥ వేడ్క మా సీత కోర్కితీవియలఁ బ్రణయ
వృష్టిఁ జూపించి మఱి ఫలింపించి తీవు!
ఒప్పఁజెప్పుచు నుంటి నీ కిప్పుడిపుడె
వలచి వలపించుకొనుము నీ భార్య ఇంక.

రాము:—(తనలో) గురుజను లేమనుకొందురో యను ననుమానమున నెంత నిలువరించినను నిలువక నా చూపుఁదుమ్మెదలు జానకి మోముఁదమ్మిపై వ్రాలి మఱలకున్నవి.

గీ॥ కలవు బంధమ్ము లెన్నొ లక్షలకొలంది
ప్రేమబంధమ్మునకు నీడు లేదు నిజము
దారువును వ్రచ్చు తుమ్మెద తమ్మికన్న
కౌఁగిలింతల దాటి పోఁ గలుగు నొక్కొ!

ప్రతీ:—మహారాజా! కన్యాజనము వచ్చియున్నది.

సీత:—(తనలో) సాధ్వసముచే ముం దడుగు వేయలేకున్నాను.

చ॥ బలితపుఁ బ్రేమచేతఁ గచభారము జారెను; దాని దిద్దఁబో
జిలుగు పయంట జారె; నొక చే సవరించెదులోన జెప్పకో
వలువని జారుపాటు లిఁక బాటిలునేమొ! విధాత రెండు చే
తులె యిడె, నేమి సేయుటకుఁ దోపదు; చెల్లెలిచాటు కేగెదన్.

(మాండవి చాటునకు వెళ్ళును.)

జన:—అమ్మలారా! రండు కౌశికమహర్షికి నమస్కరింపుఁడు.

(అందఱు విశ్వామిత్రునకు నమస్కరింతురు.)

కౌశి:—వత్సలారా! మీ మనోరథములు ఫలించునుఁగాక! సీరధ్వజా! ఇప్పటికి నా మాట దక్కినది. నీవును నీ మాటను జెల్లించుకొనుము.

జన:—(సీత చేతిని రాముని చేతిలో నుంచి)

గీ॥ ఈ ముగుద సీత నా తొలినోముపంట;
నీదు సహధర్మచారిణి; నీడ పోల్కి
నిన్ను వెన్నంటి యుండు;నీ వన్నెలాడి
కరముఁ గరమున గ్రహియింపఁగదవె రామ!

(పుష్పవృష్టి కురియును.)

కౌశి:— గీ॥ చెలిమిబేరాల వచ్చిన వలపుసొమ్ముఁ
జెరిసగము పంచుకొనుచు విస్తృతవిలాస
జలధిఁ బయనించు నీ నూత్నజంపతులకు
నాయురారోగ్యభాగ్యంబు లలరుఁ గాక!

శతా:—తథాస్తు

కౌశి:—దశరథుఁడు సపరివారముగ మధ్యమార్గమున విడిసియున్నాఁడు, వారి నెదుర్కొని యథావిధిగ నీ వివాహమహోత్సవము జరుపుదము. రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది శ్రీ వెంకట పార్థసారథి కవి ప్రణీతంబైన విచిత్రరాఘవమ్మున తృతీయాంకము.

# విచిత్రరాఘవము

## చతుర్థాంకము.

---

### దృశ్యము:—వనము :

[అంతట విరాధుఁడు ప్రవేశించును.]

విరా:—రక్కసుల నెల్లర నుక్కడంచి జనస్థానమందలి ఋషిలోకమును రక్షింప రాముఁడు కంకణముఁ గట్టుకొనె నఁట! అది విని ఖరుఁడు ప్రియసఖుఁడనగు నన్నాతనిఁ జంపఁ బురికొల్పినాఁడు. కాని యతనిఁ జూచుటతోడనే గుండె లవిసిపోవుచున్నవి. ఖరున కేమి? అతిథిచేఁ బామును జంపించినట్లు నన్ను వీనిపై కంపినాఁడు. కుడిచికూర్చుండక నా కీయుద్ధపు గోల యేల? సౌందర్యసరసి యగు జానకిం జూచినదాదిగ మన్మనోహరిణము మన్మథకిరాత వాగురం దగిలినది. రామవేషమున నామె నొంటిపాటునఁ గొనిపోయి యెందేని విహరించెదఁగాక! (పరిక్రమించుచుండును)

(అంతట శూర్పణఖ ప్రవేశించును.)

శూర్ప:—పంచవటీకృతకుటీరుం డగు రామభద్రుని భార్య యగు జానకిని నన్నై యపహరింపవలసినదిగా మహారాజు లంకేశ్వరుఁ డాజ్ఞాపించెను. పన్నుగఁ జూచితినిగదా, ఆమె యెల్లప్పుడు భర్తృపార్శ్వమందే సంచరించును! ఆమె నె ట్లపహరింపఁగలను? ఐనను, నీలమేఘశ్యామలాకారుఁ డగు నా రామునిఁ గనినంతనే యేలొకో నా హృదయము కామవికారమునకు లోనైనది. కావున జానకీరూపమున నొంటిపాటున రాముని కన్ను గప్పి చాలదవ్వు గొనిపోయి యథేచ్ఛగా విహరించెద.

విరా:—(శూర్పణఖను జూచి) అక్కడి కాలుఁ దీసి యిక్కడఁ బెట్టిన నవిసిపోదు గాని యిటు రమ్ము.

శూర్ప:—ఓహో విరాధుఁడా! (సమీపించును.)

విరా:—మహారాజునకు సేమమా?

శూర్ప:—నిర్విచారుఁడై యున్నచో సేమమే.

విరా:—(తనలో) అతనికి విచార మెందుకో! (ప్రకా) రాముని ప్రతిజ్ఞ మహారాజు చెవింబడెనా యేమి?

శూర్ప:—వినుటరయే కాదు. మంత్రులతో నాలోచించి దాని భారమంతయు ఖరునిపై నుంచెను.

విరా:—(తనలో) కనుకనే ఖరుఁడు సబహుమానముగ నాహ్వానించి నన్నిఁటకంపె. (ప్రకా) ఈ రాజకుమారులుఁ రాక్షసుల శిక్షించుటకే యీ జనస్థానమునకు వచ్చిన ట్లున్నది.

శూర్ప:—వారి ననవలసిన పని యేమి? మన బంగారము మంచిది కానప్పుడు కమసాలివాఁ డేమి సేయును? మహారాజే లేనిపోని బలవంతపు తద్దినముఁ దెచ్చిపెట్టుకొనెను.

విరా:—ఎట్లెట్లు? సవిస్తరముగఁ జెప్పుము.

శూర్ప:—జనకు నెఱుంగుదువు గదా! అతని కుమార్తె యగు సీత రామానురక్తయగుటచే మహారాజు రామవేషమున నామెను వివాహమాడ నేగెను.

విరా:—(తనలో) నాకు నామెపైఁ గన్నుపడినది. (ప్రకా) తరువాత.

శూర్ప:—అంత జనకుఁడు శంకరశరాసనము నెక్కుపెట్టినవానికిఁ బిల్ల నిచ్చెద నని ప్రతినపట్టెను.

విరా:—సరే! రాక్షసుఁ డగుటచే మన మహారాజున కది సాధ్యపడదు.

శూర్ప:—కనుకనే రాముఁడు సీతను పెండ్లియాడఁ గలిగెను. అంత మహారాజు భార్గవరాముని రామునిపైకిఁ బురికొలిపెను. కాని యతఁడును హరిచాపముతోఁ గూడ వీగిపోయెను.

విరా:—(విషాదాద్భుతములతో) పరశురాముఁడునైత మోడిపోయెనా?

శూర్ప:—అంత మహారాజు నాజ్ఞచే విద్యుజ్జిహ్వుఁడు మొదలగువారు మంథరాకైకేయీదశరథుల నావేశించిరి. మంథరయుఁ బూర్వ మొసంగఁబడిన వరద్వయముచే రామునకు వనవాసమును భరతునకు రాజ్యాధికారమును సాధింపఁ గైకేయికిఁ బుల్లవెట్టెను.

విరా:—ఇఁకఁ జెప్పున దేమి? ముద్దులపెండ్లము కోరకకోరెఁ గదా యని వృద్ధరాజందుల కియ్యకొనెను.

శూర్ప:—సీతారామలక్ష్మణులు వనవాసమునకు వచ్చిరి. పిదప నా వృద్ధరాజు రాక్షసావేశవిముక్తదేహుఁడై పుత్రస్నేహమునఁ బ్రాణములు వదలెను. భరతుఁడు కనిష్ఠునకు రాజ్య మనుచిత మని యెంత వేడినను రాముఁడు వినకుండుటచే నాతని పాదుకలను సింహాసనమున నుంచి తాను ప్రతినిధియై రాజ్యమును సాగించుచున్నాఁడు.

విరా:—అంతయుఁ దెలిసినది. ఇన నిపు డనర్థక మేమి? వనాగతుఁ డగుటచేఁ బ్రభుశక్తి రాముని వీడిపోయినది. సరే కాని నీ వెచ్చటికో బయలుదేరితివి?

శూర్ప:—జానకి నపహరించవలసిన దని మహారా జాజ్ఞాపించుటచేతఁ బర్ణశాలకుఁ బోవుచున్నాను.

విరా:—(తనలో) ఆమె నీ విరాధుఁడు గ్రహింప నెంచెను గదా! (ప్రకా) నీ కిది యశక్య మని తలంతును.

శూర్ప:—(తనలో) జానకీవేషమున రాముని౯ గొనిపోయి విహరింపవలె నని గదా నా కోరిక! కావున ని ట్లనియెదను. (ప్రకా) కనుకనే లంకకుఁ బోవుచున్నాను.

విరా:—(తనలో) ప్రకృతకార్యమున నా కొక యాటంకము తొలఁగిపోయినది.

శూర్ప:—నీ వేలకో రామాశ్రమసమీపమునఁ దారట్లాడుచున్నావు?

విరా:—రాముని౯ జంపవలసినదిగా ఖరుఁ డాజ్ఞాపించెను.

శూర్ప:—(తనలో) నా మనోహరుఁ జంపుటకా నీ రాక? (ప్రకా) నీ కయ్యది శక్యము గాదు.

విరా:—(తనలో) అతనితో నేమి? రామవేషమున జానకిని దాటించుకొని పోఁ దలంచితిని గదా? (ప్రకా) కనుకనే తిరిగి పోవుచున్నాను.

శూర్ప:—(తనలో) ప్రకృతకార్యమున నా కొక యాటంకము తీరిపోయినది. (ప్రకా) సరే! నీ పని మీఁద నీ విఁకఁ బొమ్ము.

(ఇరువురుఁ జెరియొకదారిని నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

దృశ్యము:—వనములో నొక పర్వతము.

[సీతారాములు పర్వతశిఖరముపైఁ గూర్చుండియుందురు.]

రాము:—ప్రేయసీ! జానకీ!

మ॥ అల రాత్రించర కృత్తిణక్షణవిచిత్రాతీత మాయాంబుధిన్
దలపూ వాడకయుండ నీది హరకోదండంబు ఖండించి యా
వల నా భార్గవు గెల్చి మారుని దయాభాగ్యంబుఁ బ్రాపించి కో
మలి!నిన్నుం జెమటోడ్చి యెట్టెటులో సంపాదించుకొంటిన్ దుదిన్.

సీత:—(చిఱునవ్వుతో మిన్నకుండును.)

రాము:—

గీ॥ పలుకుపల్కున నమృతంబు తొలకరింప
ముచ్చటాడవు; నీదు నెమ్మోముఁ దమ్మి
నేతిబీరకాయయె గాక నేర్పు కెక్కు
భ్రమరజాతీయ భావగీతము లవేవి?

సీత:—(ప్రేమతో) ఆర్యపుత్రా! అన్యదుష్కరము లగు భర్గదచాపఖండనమును భార్గవగర్వభంగమునుఁ దలపునకు వచ్చి యించుక విస్మయపడితిని. క్షమింపుము.

రాము:—ఏమంటివి? క్షమించుటయా? నా కించుకంతయుఁ గోపకారణము లేదే?

ఉ॥ చేదని పీడుకొంటి నఱచేతికి వచ్చిన రాజ్యసంపదన్
గాఁదగు గుర్వాజ్ఞ యని కాపుర ముంటి నరణ్యమందు నా
పైఁ దమకంబునన్ మృతికిఁ బాల్పడెఁ దండ్రియు నేడ్చియేడ్చి నే
నీదగు సాహచర్యముననే మది నెమ్మదిఁ గందు సుందరీ!

సీత:—నాథా! అది యేమిరో గాని నీ సన్నిధానమాత్రమున నరణ్యమైనను రాజాంతఃపురమునకన్న వేయిరెట్లు మిన్నగ సౌఖ్యము గొలుపుచున్నది.

రాము:—ప్రియా! ప్రేమతోఁ దులతూగు వస్తువు లేదు. ప్రేమయే గదా, వలపుదంపతుల ననురాగంపుటుయ్యెలల జోకొట్టుచుండును! ప్రేమయే గదా, వారి లేయెడందలకుఁ బరస్పర మప్రయత్నముగ—అనాలోచితముగ—అయాచితముగ—దీయని ముద్దుల సంఘటించుచుండును! ఇంతయేల? నవశిరీషకుసుమ సుకుమారివగు నిన్ను నాతోఁ గూడ నీ దుష్ట విపినభూముల కాకర్షించిన దీ ప్రేమయే గదా!

సీత:—స్వార్థపరుల విధమిట్లే యుండును. చెట్టువేయున దొకరు ఫల మనుభవించు నది వేఱొకరు. చూడు మా తేనెటీగలిట్లు చెమటోడ్చి కూర్చిన తేనెను మానవుఁ డనుభవించుచున్నాఁడు.

రాము:—(తనలో) నేను స్వార్థపరుఁడనుగా నని యీమె యూహ. (ప్రకా)

గీ॥ ఒకని వస్తువు జగతి వేఱొకని కబ్బు
తరుణి! భాగ్యవశంబునఁ; దావకీన
మధురమధురాధరాధరసుధను గొనఁడె?
రాముఁ డిందుల వైయర్థ్య మేమి గలదు?

సీత:—(తనలో)

మ॥ కలఁ గన్నట్లు, బ్రియుండు వచ్చినటు,నన్ గౌఁగింట ముద్దాడిన ట్టులు నేనుం బొలయల్కఁ గన్నటు, లతండున్ నాదు కౌఁగిళ్లు ముద్దులు నాకిమ్మని బల్మిఁ గొన్నయటు లెంతో నాఁడు కల్పించుకొం చలరుం జెందితిఁ, జెందుచుంటి నది ప్రత్యక్షంబుగా నేఁ డిటన్.

(ప్రకా) ఆర్యపుత్రా! నవాంబుదశ్యామలకోమలంబు లగు కాంతుల వెదజల్లు పుష్పగుచ్ఛములచే నలరారు నీ యతసీవృక్ష మీ ప్రదేశము నలంకరించు చున్నది. చూడుము.

రాము:—(తనలో) ఆహా! ఈమె వచోరచన యెంత చమత్కారముగ నున్నది. (ప్రకా) జానకీ! చూడుచూడు మా సరోజిని భర్త యగు కూల మెంత యను కూలముగ నున్నను సాలావళిని నెత్తి కెక్కించుకొనె నని హంసకంఠమునఁ గూకలు వేయుచు నల్లనాఁటి నీ మణిమేఖలాకలకలమును దలపించుచున్నది.

సీత:—(తనలో) ఆర్యపుత్రుఁ డడవికిఁ బ్రయాణ మైనప్పుడు "నన్నుఁ గూడఁ దీసి కొని పొ"మ్మని మఱిమఱి యాచించి మొదట నంగీకరింపకుండుటచే గోపగించుకొని బొమముడిపాటుతోఁ దిరిగి యంతఃపురమునకుఁ బోవుచుండ నాఁడు నా మణిమేఖల చేసిన కలకలము నిప్పుడు నాథుఁడు తలంచు చున్నాఁడు కాని మ్మిట్లను చూచెద. (ప్రకా) రాక్షసులనుండి జనస్థాన నివాసులగు ఋషుల రక్షింపఁ గంకణము గట్టుకొనిన నీ భుజదండము నాశ్రయించిన నే నీ దుర్గమారణ్యమున నిర్భయముగా నెంతెంత వింతలను జూడలేను?

రాము:—(ముందునకుఁ జూచి) రాక్షసుల పేరు నెత్తియు నెత్తక ముందే చూడు మా కాంచనవనమున నొక రాక్షసుఁడు ప్రత్యక్ష మైనాఁడు. ఈ సంగతి లక్ష్మణునకుఁ దెలియదు కాఁబోలు!

(కొండ దిగువ ప్రదేశమున లక్ష్మణుఁడు ప్రవేశించును.)

లక్ష్మ:—ఎవఁడో రాక్షసుఁ డీ కాంచనవనమునఁ బ్రవేశించుచున్నాఁడు. కానిమ్ము తని కిప్పుడే తగిన శాస్తి రొనర్చెద. (ఆయుధములతోఁ బరిక్రమించును.)

సీత:—(వేలాకవైపు జూచి) అది కాంచనవనము కాదు. అతఁడు రాక్షసుఁడునుఁ గాఁడు. అది కర్ణికారవనము. చూడుచూడు మొక చింపిరితల చుప్పనాతి వచ్చుచున్నది.

రాము:—ప్రియా! నీ వెక్కడ చూచుచున్నావు? నేఁ జెప్పుప్రదేశ మియ్యది. (నిర్దేశించును.)

సీత:—(చూచి నవ్వుచు) రాక్షసుఁడు కాఁడు. దేవరవారే యా ప్రవేశించినది.

రాము:—(చూచి) ఆశ్చర్య మాశ్చర్యము. పునర్దర్శనమున రాక్షసుఁడు నారూపమును ధరించెను.

సీత:—(వేలాకవైపు జూచి) కర్ణికారవనప్రవిష్ట యగు నీమెయు నా రూపము ధరించినది.

రాము:—(చూచి ఆశ్చర్యముతో) వీరి కీ రూపగ్రహణమునఁ బ్రయోజనమేమో?

సీత:—ఈ పర్వతాగ్రము దిగి పోయి చూతమా?

రాము:—అవసరము లేదు. ఇచ్చటివారి కామడదూరమందలి వస్తు వైననుఁ గన్నులకుఁ గట్టిన ట్లగుపడును.

లక్ష్మ:—(చూచి విస్మయముతో) అయ్యో! సాయుధుఁడ నగు నేను వచ్చిన పని వ్యర్థ మైనది. పూజ్యులగు నన్నగారే రాక్షసవధార్థ మిచ్చటఁ బొంచియున్నారు. (ఆలోచించి) ఐన జానకి యేమయ్యె? ఇంతకుముం దిరువురునుఁ గొండపై నుం డిరిగదా? ఆమె నొంటిగ నచ్చట డించి యితఁ డిచ్చటి కెట్లు వచ్చును? (పైకిఁ జూచి) సీతారాములు పర్వతశిఖరముపైననే యున్నారు. కావున నెవ్వరో రాక్షసుఁడే మా రామునివేషము ధరించినాఁడు. ఈ చెట్లమరుగున నుండి వాని కనులబడకుండ నీ నాటకమును జూచెదను.

[అంతట విరాధుఁడు రాముని వేషమునఁ బ్రవేశించును.]

విరా:—(ముందునకుఁ జూచి) ఏమి? కర్ణికారవనమునుండి చంపకవాటి కేగుచున్నదే జానకి!

[అంతట శూర్పణఖ సీతవేషమునఁ బ్రవేశించును.]

శూర్ప:—నే నిచ్చటనే పూవులు గోయుచుండెద. రఘుకుమారుఁ డిటే రాఁగలఁడు.

విరా:—(తనలో) ఈమెయే నిరతిశయరూపలావణ్యవతి యగు జానకి!

గీ॥ గిలుకు టందెలు మురుపునఁ గులుకరింపఁ
గులుకు బెళుకులు వలపులఁ గ్రుమ్మరింప

నల్లదే! సీత ప్రణయగృహాంగణమునఁ
గన్నుగల్వలఁ దోరణఁ గట్టుచుండె.

రాముఁడుగాని లక్ష్మణుఁడుగాని యిచ్చోటకు రాకముందే యీమె నెత్తుకొని పోవు నుపాయ మూహింపవలెను.

శూర్ప:—(చూచి తనలో) ఇదే నా హృదయచోరుఁడు వచ్చుచున్నాఁడు.

గీ॥ వేయి పలుకులఁ బని యేమి వీనిఁ గనఁగ
నాదు మేనెల్లఁ గన్నులైనపు డొకింత
తృప్తి యను నట్టి దది యేమొ తెలియునేమొ?
ఇతనికన్నను స్వర్గ మింకేమి గలదు?

తిమ్మిని బమ్మి జేసియో బమ్మిని తిమ్మి జేసియో వీని నెట్లయిన 'గొనిపోయి సుఖింపవలయును. (పుష్పములఁ గోయుట నటించును.)

విరా:—(సమీపించి) జనకనందినీ!

గీ॥ చంపకమ్ములు వలసిన సతి! త్వదీయ
ప్రణయ దాసానుదాసుఁడు రామభద్రుఁ
డిడుగో వీని నియోగింపు మేల నీదు
పేశలశరీరమును గష్టపెట్టుకొనెదు?

శూర్ప:—(హర్షముతోఁ దనలో) ఇతఁడు నన్ను జానకి యనియే తలంచుచున్నాఁడు. ఆహా! ఏమి వీని మంజులాలాపములు? వినినంతమాత్రముననే యొడలు పుల కించుచున్నది. కాని విన్నాతని నిశ్శంకముగా నపహరించుకొనిపోవు విధమున ని ట్లనియెద. (ప్రకా) నాథా! అల్లదే! ఆ కనంబడు ప్రదేశమున సంపెంగ పువ్వులు లెక్కకు మిక్కుటముగ నున్నవి. అచ్చటి కేగి కోసికొందము.

(పరిక్రమించును.)

విరా:—(తనలో) సహజస్నేహార్ద్రము లగు నీ పలుకులు వీనుల నమృతముఁ జిలుకు చున్నవి. కాని విన్నామె ప్రదేశాంతరగమనమే యీమెను నిశ్శంకముగ నప హరించుకొనిపోవుటకు మార్గము కాఁగలదు. (ప్రకా) సరే నీయిష్టము.

(అనుసరించును.)

లక్ష్మ:—చంపకవనాభ్యంతరమున మా వదినె జానకి పలుకులు వినవచ్చుచున్నవి. ఇం తకుముందే యీమెను గొండపైఁ జూచితిని గదా! ఇదియు నెవ్వతెయో రాక్షసియే. వీరి వ్యాపారము జూడ నొసలు బత్తుఁడు నోరు తోడే లన్నటు లున్నది.

సీత:—ఆర్యపుత్రా! ఆ రాక్షసుని మీరే యనుకొని లక్ష్మణుఁ డనుసరించుచున్న ట్లున్నది.

రాము:—అతఁడు నిగూఢముగ వారిని వెంబడించుచుండుటచే వారల రాక్షసులని యెఱింగియే యుండు నని తోఁచుచున్నది.

విరా:—సుందరీ! ఈ వన మెంతదూరమువర కాక్రమించుకొని యున్నదో?

శూర్ప:—(తనలో) ఎచ్చట విజనంబున ని న్నెత్తుకొనిపోవుటకు శక్య మగునో యం తవరకు. (ప్రకా) ఆర్యపుత్ర! సమీపించినాము. ఇంచుక యోపిక పట్టుము.

విరా:—(తనలో) ఆహా! ఏమి యీయామె లావణ్యము?

గీ॥ పెదవి సందిట హాయిలి విడువలేక
విడువలేక యేతెంచు నా పిన్ననవ్వొ
లక్ష్య సేయును, ప్రణయలీలావిలాస
సరసిలోఁ దేలియాడెడు సమయ మెపుడొ?

రాముని యాశ్రమమునుండి చాల దవ్వు వచ్చితిమి. ఈమె నపహరించు మార్గ మాలోచింపవలెను. (ప్రకా) జానకీ! ఈ కోసికొన్న పూలు చాలు లెమ్ము. ఇది రాక్షసులు సంచరించు ప్రదేశము.

లక్ష్మ:—పాపము! ఈమెను సీత యని నమ్ముచున్నాఁ డీ రాక్షసుఁడు!

శూర్ప:—(తనలో) నేను రక్కసినిగానా? (ప్రకా) రక్కసులఁ జంపఁ బ్రతినఁ బూనిన నీవు నా యండ నుండ నా కేమి భయము?

విరా:—(తనలో) నిజముగా నే నే ప్రతిజ్ఞను నెఱుఁగను. ఓ ముద్దరాలా! రామునిఁ జంపుటకే నేను రామవేషమున ని న్నెత్తుకొనిపోవుచున్నాను. (ప్రకా) అట్లని పాఱెడు బండ కెదురుగాఁ గాళ్లు సాచెదువా రుందురా

లక్ష్మ:—(నవ్వుచు) యథార్థముగా నన్నగారివలెనే పలుకుచున్నాఁ డీ రాక్షసుఁడు.

శూర్ప:—రావణునికన్న బలవంతుఁడు గదా ఖరుఁడు? అతని యెడ నీ ప్రతిన యెట్లు చెల్లఁగలదో?

సీత:—వీ రిరువురుఁ బరస్పరము మాట్లాడుకొనుచున్న ట్లున్నది.

రాము:—ఔను. మన మింకేమేమి చిత్రములు చూడవలెనో?

విరా:—(తనలో) నేను రాము నేది యడుగవలెనో దాని నీమె నన్నే యడుగుచున్నది. కాని మ్మిట్లనియెద. (ప్రకా) పరశురాము నోడించిన నా పరాక్రమ మెఱుఁగవా?

లక్ష్మ:—ఈ జవాబు సరియైనదే.

శూర్ప:—(తనలో)

గీ॥ కౌఁగిళులఁ గట్టుకొన్న స్వర్గమ్మునందు
వలపు వాల్చూపు దూఁగుటుయ్యెలల—ముద్దు
సెజ్జలందుఁ—జేతోవిపంచికల మేళ
వించి ప్రేమగీతము లాలపించు టెపుడొ!

(ప్రకా) యెఱుఁగకేమి? నీచేఁ జెప్పించుట కట్లంటిని. (పుష్పముల గోయుచుండును.)

విరా:—(తనలో) అదృష్ట మనిన నాదే. యదృష్టము. జానకీదేవి వలపుల నెల్ల గొల్లగొనుచుంటిని. (ప్రకా)

గీ॥ కామినీ! నీదు మేనెల్లఁ గందిపోయెఁ,
బాణిపల్లవములు వసివాళ్ళువారెఁ,
దళుకు జెక్కుల లేఁజెమ రలముకొనియె,
నాపు మిఁకనైన నీదు పుష్పాపచయము.

శూర్ప:—(సిగ్గుతోఁ దనలో) ఇతఁడు నన్ను జానకి యని తలంచి యీవిధముగఁ బ్రార్థించుచున్నాఁడు. ఈతని నెట్లేని మాయపుచ్చవలెను. (ప్రకా) మనోహరా! ఈ సమున్నతం బగు సంపెంగచెట్టు కొనకొమ్మల సుకుమారము లగు సుమములు మెండుగ నున్నవి. వాటి నొడ నా కభిలాష కలుగుచున్నది. నా వీఁపుపై నెక్కి వాటినిఁ గోసిపెట్టి నా ముద్దు చెల్లింపవా?

విరా:—(తనలో) ఇదే నా కవకాశము. (ప్రకా)

గీ॥ ఇంతగఁ బ్రయాసపడఁగ నీ కేల నీదు
ప్రణయదాసానుదాసుఁడు రాముఁ డిడుగొ!
వెండి వచియించుచుంటి నా వీఁపు నెక్కి
కొమ్మ! వలసిన కుసుమముల్ కోసికొమ్మ!

లక్ష్మ:—వీరి చరిత్ర మంతకంతకుఁ జిత్రవిచిత్రమగుచున్నది.

ఉ॥ అతఁడె రామభద్రుఁ డని యామెయు నామెయె భూమిజాతయం
చాతఁడు సంతసంపడుచు నాయమ నెట్టులొ దొంగిలింపఁగా
నాతఁడు వాని నేవరుస నైనను నెత్తుకపోవ నామెయుం
యాతన నందుచుండి రొక రైనను దత్త్వ మెఱుంగ లేరహో!

శూర్ప:— (తనలో) కాని మ్మిం దపాయమేమి? ఈతని వీఁపుపై నెక్కి యితని గాత్రమును నా పాదములచేఁ బెనవైచి గగనమార్గమున నెత్తుకొని పోయెద. (శూర్పణఖ విరాధుని వీఁపుపై నెక్కును. ఇరువురును గగనమార్గమున నెగిరి పోవుచుందురు.)

సీత:—ఆర్యపుత్రా! అయ్యవారినిఁ జేయఁబోయినఁ గోఁతి యైనది.

రాము:—ఏమిది? నా రిరువు రొకరినొక రెత్తుకొనిపోవుచున్నారే?

సీత:—ఇఁక ముం దేమి జరుగునో తెలియకున్నది.

లక్ష్మ:—ఆహా! వీ రీ యత్యద్భుతరామాయణము నాడుట కెంత శ్రమపడు చున్నారు? (పైకిఁజూచి) పైనుండి జటాయువు వచ్చుచున్నాఁడే. అతఁ డేమో యనుచున్నాఁడు?

(ఆకసమున జటాయువు.)

గీ॥ కనులు మూసుక పాల్ద్రావ గడఁగు పిల్లి
యటుల రాముని వేషాన నతని భార్య
నెత్తుకొనిపోవుచుంటి వీ వెవఁడ వోరి!
అడుగు కదుపుము—తలయూడిపడును నిజము.

లక్ష్మ:—ఇతఁడును రాక్షసిని నిజమగు సీత యని భ్రమించుచున్నాఁడే?

సీత:—పైనుండి వచ్చు పక్షీంద్రుం జూచి వారు మరల భూమిమీదికి వచ్చుచున్నారు.

రాము:—అతఁడే జటాయువు. అన్న యగు సంపాతికి నమస్కరించి వచ్చుచున్న ట్లున్నాఁడు.

శూర్ప:—(విషాదముతో) ఇతఁ డెవరో రామునిరూపమున నన్ను మోహపెట్టు చున్నాఁడు. లేకున్న మానవమాత్రుఁ డెక్కడ? ఈ యత్పతనశక్తి యెక్కడ? (ప్రకా) ఎవఁడురా నన్నుఁ దీసికొని యెగిరిపోవుచున్నాఁడు?

విరా:—(తనలో) అక్కటా! వినాయకుని పెండ్లికి వేయి విఘ్నములు. ఎట్లో కష్టపడి సీత నెత్తుకొనిపోవుచుండ నీ ముసలిగ్రద్ధ యొకటి దాపురించినదే? (కొంచె మాగి) ఒకవేళ యీమె సీత కాదేమో? ఐనయెడల కుసుమకోమలి యగు నామె నన్ను దీసికొని యింత వేగముగా నింగి కెగిరిపోఁగలదా? (ప్రకా) ఎవ్వ తెరా నన్ను దీసికొని యెగిరిపోవుచున్నది?

లక్ష్మ:—(సమీపించి)

చ॥ సుకముగఁ బ్రొద్దు వోయినది; చొక్కపు నాటక మాడినారు; నీ
వైక దనుజుండ వాయమయు నొక్క నిశాచరియే; వృథాగమీ

రోకరోకరీ వరించుకొనియుంటిరి; పాపము! జోగిజోగి రా
చుకొనఁగ బూది రాలినది జుండు! నిరర్థకమయ్యె వేసముల్.

శూర్ప—(జ్ఞప్తికిఁ దెచ్చుకొని) ఏమీ నీవు విరాధుఁడవా?

విరాధు:—(ఆలోచించి) ఏమీ నీవు శూర్పణఖవా?

(ఇరువురు స్వస్వరూపముల ధరించి భూమిపై నిలుతురు)

లక్ష్మ:—ఓరోరీ! దురాత్మ! పరనారీచోర! విరాధా! చచ్చితివి, చచ్చితివి.

(కత్తిదూసి విరాధునిఁ బట్టుకొనును.)

విరా:—ఓరీ! విడువుము విడువుము. అర్భకుఁడవు నీవా నన్నెదిరించువాఁడవు?

లక్ష్మ:—ఓయీ! ఊరక నేల విడిచి సాముచేసెద వేల?

శూర్ప:—అహో! ప్రమాదము. విరాధుఁడు లక్ష్మణునిచేతిలో జనిపోవుచున్నాఁడు. జటాయువు నిటే వచ్చుచున్నాఁడు. ఇకఁ నేమి గతి?

(విచారము నటించును.)

జటా:—(ప్రవేశించి. తనలో) ఏమిది? జానకీరూపము ధరించిన దీ దుష్టనాతిరయేనా? (ప్రకా) వత్సా లక్ష్మణా! ఋషికంటకుండగు నీ విరాధుని విడువకుము.

సీత:—ఈ రాక్షసీరాక్షసులు తమ నిజరూపములను గ్రహించిన ట్లున్న దే?

రాము:—అదృష్టవశమున వర్ధిల్లితిమి. సౌమిత్రి తన చేతి కత్తిచే నీ విరాధుని యుత్తమాంగము నుత్తరించినాఁడు.

జటా:—ఈమె జానకి నపహరించుటకు దశగ్రీవునిచేఁ బంపఁబడినది. ఈమె నుపేక్షింపకుము.

లక్ష్మ:—నే నుపేక్షించినను నా కరవాల ముపేక్షింపదు. ఐన నీమె స్త్రీయగుటచే నీమె ముక్కుచెవులనుగోసి బహూకరించెద.

(అటులొనర్చును. శూర్పణఖ పారిపోవును.)

రాము:—జానకీ! మన మార్గము నిష్కంటక మైనది. క్రిందికి దిగిపోయి సౌమిత్రీ జటాయువుల సంభావింతము రమ్ము. (దిగుదురు.)

లక్ష్మ:—గృధ్రరాజా! సీతారాములు కొండదిగి వచ్చుచున్నారు.

[సీతారాములు సమీపించి నమస్కరింతురు.]

జటా:—వత్సా! చిరంజీవ. అమ్మా! వీరప్రసవవు కమ్ము.

లక్ష్మ:—పిచ్చుగుంటుపై భాగీరథి ప్రవహించిన ట్లీ మహాత్ముఁడు మనల బవిత్రులఁ జేయ వచ్చినాఁడు.

రాము:—(లక్ష్మణునిఁ జూచి) అదృష్టవశమున విజయి వగు నిన్నుఁ జూడఁగల్గితిని.

సీత:—ఆ రాక్షసీరాక్షసు లెవ్వరో?

జటా:—అతఁడు పదునాలుగువేల పదునలుగురు రక్కసులకు నాయకుఁడైన ఖరునకు మిత్రుఁ డగు విరాధుఁడు. ఆమె రావణుని చెల్లెలగు శూర్పణఖ.

రాము:—విరాధుఁడేనా లక్ష్మణుని కరవాలమున కెఱయైనది?

జటా:—ఔను. మఱియు నొక సంగతి. విరూపిణియగు శూర్పణఖను దర్శించినంత మాత్రమున ఖరుని క్రోధము ని న్నభిషేకింపఁగలదు.

లక్ష్మ:—రాజు కొట్టఁగా మొగసాలకు మొఱవెట్టిన నేమి లాభము?

రాము:—రానిం డేమి భయము? చాల తడ వైనది పర్ణశాలకుఁ బోయి సావకాశముగ ముచ్చటించుకొందము రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది శ్రీ వెంకట పార్థసారథి కవి ప్రణీతం బైన విచిత్రరాఘవమునఁ

జతుర్థాంకము.



# విచిత్రరాఘవము

## పంచమాంకము.

దృశ్యము:—లంకాపురములో నొక వీధి :

[అంతట ననల ప్రవేశించును.]

అనల:—(ముందునకుఁ జూచి) ఏలకో తండ్రిగారి మంత్రి యగు సంపాతి చాల తొందఱగా నిటు వచ్చుచున్నాఁడు.

సంపా:—(ప్రవేశించి) అదిగో విభీషణమహారాజుగారి కుమార్తె యనల యిచ్చట నున్నట్లున్నది. (సమీపించి) అమ్మా! అనలా! ఎచ్చటినుండి వచ్చుచున్నావు?

అనల:—విద్యుజ్జిహ్వుని యింటినుండి.

సంపాతి:—అచ్చటి కేల వెళ్ళితివి?

అనల:—కలదు గదా, మహారాజ లంకేశ్వరుని సోదరి శూర్పణఖ.

సంపా:—(నవ్వి) అబ్బ! చంపితివి. అత్తగా రనినఁ జాలదా? ఆమె రామునిఁ గామించి ముక్కుచెవులఁ గోల్పోవుటయే గాక ఖరుని సైతముఁ జంపించెను.

అనల:—ఆమె విద్యుజ్జిహ్వుని భార్య యడుగఁగాఁ దన నాశికాచ్ఛేదనకారణ మెఱింగించి మాటలసందర్భమున రాముఁ డటువంటివాఁ డిటువంటివాఁ డని యేమేమో వర్ణించినది. అది విని రాముని యాకారము నొకపరిఁ జూచి యిచ్చెద నని యామె యడుగఁగా మున్ను జానకి పెండ్లికానప్పుడు వ్రాసిన చిత్రపటము నామె కిచ్చి వచ్చుచున్నాను.

సంపా:—ఆ చిత్రపటము నీయొద్ద నెందు కుండెను?

అన:—ఈ దీర్ఘవిరహమున దీనివలనఁ గొంత కాకపోయినఁ గొంతయైన జానకీ దుఃఖభారముఁ దొలఁగించుచుంటిని.

సంపా:—జానకి నపహరించినది మన మహారాజు. ఇందు భాగస్థుఁడయిన మారీచుని పీచమడంగినది. ఇది యిట్లుండ నావును నావును గ్రుమ్ములాడి మధ్య లేఁగ కాలు విఱుగఁదొక్కి నట్లు రామరావణుల వైరము గరుత్మత్సహోదరుఁ డగు జటాయువు మరణమునకు దారితీసినది. సరే కాని యిఁక నామెకు మఱి యెట్లోఱటఁ గూర్పఁగలవు?

అనల:—అందుచేతనే యామెకుఁ బ్రాణములు నిల్పు నుపాయము వెదకుచున్నాను.

సంపా:—ఏలిక యగు విభీషణకుమారునకునుఁ దక్కిన మాల్యవత్ప్రభృతులకును వాలివధ విన్ననాఁటనుండియు సీతనుఁ దిరిగి రామభద్రున కర్పించుటయే మే లని తోఁచుచున్నది.

అనల:—ఏమిˆ రాముఁడు వాలిని సైతము సంహరించెనాˆ ఇఁక నీరు లన నెంతటి వనిˆ గుడి మ్రింగువానికిఁ దలుపు లప్పడములు గదాˆ ఐన మన మహారాజు గారి యభిప్రాయ మేమిˆ

సంపాతి:—మంత్రులలో మహారాజును దర్శించి చెప్పఁగల సాహస మెవరి కున్నదిˆ అతఁడు మంత్రులతో నాలోచింపక, చేయదగిన పను లెవ్వియుఁ జేయక యెల్లప్పుడు జానకీ నామస్మరణ జేయుచుఁ బ్రబల వైరానుబంధుఁడయి యుండుటచే మాటలచే వాలివధ చెప్పుటకు వలనుపడక మంత్రులు కూడఁబలుకుకొని రాక్షసాచార్యుఁడగు శుక్రునిచేఁ గొండొక నాటకమును వ్రాయించి దానిని వారి యెదుటఁ బ్రదర్శింప నెంచియున్నారు. నాటకదర్శనార్థము దయ చేయ వలసిన దని మహారాజున కొక యాసన్నపరిచారకుని ముఖమున నివేదించితిమి. అప్పు డేబుద్ధియుండెనో గాని భాగ్యవశమున నాతఁ డందుల కియ్యకొని తన నర్మసచివుఁ డగు మహాపార్శ్వునితోఁ గూడ సంగీతశాలయం దాసీనుఁడయి యున్నాఁడు.

అన:—అమాత్యశేఖరా! చెప్పుము చెప్పుము. ఆ నాటక మెక్కడినుండి యెంతవరకు వ్రాయఁబడినదిˆ

సంపాతి:—రాముని సీతాన్వేషణము మొదలు వాలివధ వఱకును.

అన:—జానకియుఁ జిత్రపటములేమి నాటకదర్శనమున మనోవినోదనముఁ జేసుకొన వచ్చును గదాˆ

సంపాతి:—అట్లే చేయవచ్చును. కాని యామె ప్రచ్ఛన్నయై యుండుట మేలు.

అనల:—విద్యుజ్జిహ్వుని భార్యయొద్ద రాక్షసాంధంకరణమణిఘటిత కంకణములు రెండున్నవి గాదాˆ ఆమె నల్లించి బెల్లించి యెట్లయిన నీ కంకణములు సంగ్రహించుకొని వత్తును. అం దొకటి జానకియు మఱొకటి నేనును ధరించి సంగీత శాలకు వచ్చెదము.

సంపాతి:—అవు నవును. ఆ కటకములనుగూర్చి వినియుంటిని. సమయమున కక్కఱకు వచ్చినవి. సరే! నీవు వెళ్ళుము. నేనునుఁ బాత్రధారిణు లగు నప్సరసలఁ బిలుచుకొని వచ్చెద.

(ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

దృశ్యము: సంగీతశాల.

[అంతట మహాపార్శ్వునితో రావణుఁడు ప్రవేశించును.]

రావ:—వయస్యా! నాటకప్రేక్షణమునకై యీ మంత్రిజనులు నన్నేల నిర్బంధించు చున్నారు?

మహా:—దేవా! జానకికై మన్మథతాపము నందుచున్న మీ కొకింత శాంతిఁ గల్పించుటకుఁ గానోపు.

రావ:—ఐన నాటక మారంభింపఁబడుఁ గాక!

(అంతర్నాటకము.)

నాంది.

సీ॥ భవుఁడు నెవ్వాని సిలుగుల భయముచేత
భార్యల భరించుఁ దీరని బరువు గాఁగ
నెవఁడు దంపతి సుఖహేతు వెవఁడు విరహి
జనశరుం డతఁ డతనుండు జయముఁ గనుత!

రావ:—ఇది నిజమే.

(నాద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును)

సూత్ర:—

గీ॥ అల శరత్తు కాదంబిని నపహరింప
దొఱకిన ధనంబు వ్రోవఁగ దుఃఖపడెడు
నతని తెలిఁగునఁ గాననాభ్యంతరమునఁ
గుదురు సెడి క్రుమ్మరుచు నున్నయది శిఖండి.

రావ:—నే నపహరించిన జానకిం గానక కన్నీరు మున్నీరుగా నేడ్చుచున్న యీ రాముని సంగతివలెఁ దోఁచుచున్నది.

మహా:—నేను నట్లె తలంచుచున్నాను.

(తెరలో)

హా! వత్స లక్ష్మణ! ఈ పర్ణకుటీరము సీతారహితమై వెన్నెలకు వెలియైన రాత్రివలె నున్నది.

సూత్ర:—మహారాజా! అవధరింపుము. లక్ష్మణపాత్ర ధరించిన ఘృతాచితో సీతాన్వేషణపరుం డగు రాముని భూమికను ధరించి పుంజికస్థల యిదే రంగస్థలము నలంకరించుచున్నది. (నిష్క్రమించును.)

(ప్రస్తావన)

రావ:—నాటకమును బాగుగ మొదలుపెట్టినారు. సీతను గానక రాముఁ డేమి చేయునో తెలిసికొన నాకుఁ గుతూహల మగుచున్నది.

(అంతటఁ గంకణములు ధరించి సీత, అనల ప్రవేశింతురు.)

సీత:—చెలీ! అనలా! అంతఃపురవనాంతరమున నిరోధింపఁబడి దుర్వారశోకానల దందహ్యమానమాననస్నై యుండుటచే నీ నాటకముఁ జూడ నిచ్ఛ లేదుకాని యార్యపుత్రుని కథాప్రస్తావమని ముచ్చటపడితిని

అనల:—జానకీ! ఇచ్చటఁ గూర్చుండి చూచుచుందమా?

సీత:—(రావణునిఁ జూచి) పరకాంతాపహరణమహాపాతకి యగు నీ రాక్షసేశ్వరుఁడు మన సమీపమునందే యున్నాఁడే?

అనల:—నీ భయము ని ట్లనిపించుచున్నది గాని నిజముగా మన మాతనికిఁ జాల దూరమున నున్నాము. మన కీ కటకము లుండుటచే నిచ్చట నిశ్శంకముగాఁ గూర్చుండవచ్చును. వారిమాటలు మనకును, మన మాటలు వారికిని వినఁబడవు.

సీత:—పూర్వము తపస్వివేషమున వచ్చిన యా రాక్షసున కీ కటకయుగళమును బహుమానముగ నిచ్చుట నా కిపు డుపయోగించినది సుమా?

అనల:—ఆశ్చర్య మాశ్చర్యము!! రాక్షసపుత్రిక నగుటచే నాకును నీవు కాన్పించుట లేదు. స్పర్శచేత మాత్రమే నిన్నుఁ దెలిసికొనఁ గలుగుచున్నాను.

సీత:—నీ చేతికిఁ గూడ నొక కంకణముండుటచే నీవును నీసులకుఁ గనఁబడ వని తలంతును.

అనల:—సఖీ! నీకు నేవునుఁ గాన్పింప వనుము. నా శరీరము నాకే కనుపట్టుట లేదు.

సీత:—పాత్రధారిణు లగు నప్సరసల కెట్లుండునో?

అనల:—వారు చూచిన దోషమేమి? కూర్చుండుము. (ఇరువురునుఁ గూర్చుండురు.)

(అంతట లక్ష్మణుఁడు వెంబడింప రాముఁడు ప్రవేశించును.)

రాము:—తమ్ముఁడా! వట్టిపోయిన యీ పర్ణశాలనుఁ జూచిన నా హృదయము తటుకుకొనిపోవుచున్నది.

రావ:—(సంతోషముతో) అంతే కావలెను. అంతే కావలెను.

సీత:—నాయందలి యార్యపుత్రుని స్నేహానుబంధ మట్టిదే గదా? నేను లేని పర్ణశాల నెట్లు చూడఁగలఁడు?

లక్ష్మ:—అన్నయ్యా! దుఃఖింపకుఁడు. వదినెగారి మయూరాకుల మగు నద్రినికుంజము నకుఁ బోయియుండును.

రావ:—ఆమెను నేనెత్తుకొని పోయితి నని వీఁ డెఱుంగఁడు. వట్టి మూఢుఁడు.

సీత:—అట్లు జరిగియుండక పోయినను జిరంజీవి లక్ష్మణుం డన్నగారి కూఱట కలుగుట కట్లు పలుకుచున్నాఁడు.

రాము:—నన్ను విడిచి జానకి యెన్నఁడు నచ్చటి కేగియుండలేదు.

రావ:—కేవలము ప్రేమానుబంధము చేతనే కాదు. కాతర్యముచేఁ గూడ నట్లుండును.

సీత:—ఔను. ఆర్యపుత్రుఁడు దగ్గఱ లేకున్న నాకేదియు రుచింపదు.

లక్ష్మ:— పూలు కోసికొనుటకే పున్నాగవాటికకుఁ బోయియుండును.

రాము:—(పరిక్రమించి) తమ్ముఁడా! సీత యెందునుఁ గాన్పించుటలేదు.

ఉ॥ కన్నుల లేడిపిల్లలును, గమ్మని పల్కుల రామచిల్కలున్
నెన్నడుమున్ మృగేంద్రములు, నిద్దపు జన్నుల నేన్గుగున్న, లి
ట్లున్నతి నెంచి యొక్కొకటి యొక్కొక వస్తువుఁ బంచుకొంచు నా
యన్నులమిన్న మ్రింగినవి యక్కట! వన్యమృగంబు లన్నియున్.

రాము:—(ఉత్సాహముతో) దీనితో నీతఁడు మరణించుఁ గాక! నిజముగా నట్లే యైనచోఁ దప్పక జానకి యిఁక నతనియందలి మోహమును వీడి నా భుజదండము నాశ్రయింపఁగలదు.

సీత:—అనలా! నా కారణమున నార్యపుత్రుఁడు పడరాని పాట్లు పడుచున్నాఁడు.

గీ॥ రామచంద్రుని నేను, నన్ రామచంద్రు
డింకఁ జూచుకొందుమొ? లేదొ? యింత కేస
తీపతులకు వియోగంబుఁ దాపినానొ?
కట్టి కుడుపక వదలునే కర్మఫలము?

లక్ష్మ:—(సమీపించి) అన్నయ్యా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

రావ:—(ఈర్ష్యతో) మఱల నీ మాయదారి లక్ష్మణుఁ డూఱటఁ గూర్చి యీతనిని బ్రతికించుచున్నాఁడే?

సీత:—భాగ్యవశమున లక్ష్మణుని యూఱడింపుచే నార్యపుత్రుఁడు మఱల నించుక తేఱుకొనుచున్నాఁడు

రాము:—(ఊఱడిల్లి) తమ్ముఁడా! ఇఁక నేమి సేయుదము?

రావ:—ఉత్తమస్త్రీవియోగమున కేదియుచితమో - మహారాజ దశగ్రీవున కేది యిష్టమో దానినే.

రాము:—తమ్ముఁడా! చూడు చూడు మా కొండవా గేమిగొ చెప్పుచున్నట్లున్నది సమీపించి యడిగెద (దగ్గఱి విషాదముతో)

చ॥ అనవరతమ్ము గొండరయొడియందుఁ బరుండెడ వేల? పిల్చినం
త నరుఁగు మేల్కొనుంగు నిడి న న్గన వే మనువాఁడ?నా ప్రియాం
గన నినుఁ బోలు నచ్చముగఁ గాంచితి వే? అలివేణి నంచయా
నను నళినాయ తేక్షణను నా కెఱిఁగింపవె నిన్ను వేఁడెదన్.

రావ:—సీతావృత్తాంతము నెఱిఁగించుటకు దాని దేమి గుండెయా? చెలువా? ఎటుఁ గదా నా ప్రతాపము?

సీత:—ఆర్యపుత్రుఁ డున్మత్తునివలె నా కెలరయేలు నడుగుచున్నాఁడు! నాయందలి స్నేహానుబంధమే గదా అతని నీ స్థితికిఁ దెచ్చినది.

రాము:—ఇది మందబుద్ధి గల దగుటచేఁ జెప్పుట లేదు.

గీ॥ అదిగో! కనఁబడు సురపొన్న కదలి చివురు
వ్రేళులను జూపి న న్నటు పిలచుచుండె;

రావ:—ఐననేమి?

రాము:—

తెలిసియేయుండు దానికిఁ గల తెఱంగు,
చెప్పునో యేమొ? అడిగిచూచెదను గాక! [సమీపించును]

రావ:—ఓరీ పాదపాపశద! సీతావృత్తాంత మించుకంత వెడలఁగ్రక్కితివేని నా వాఁడి కటారిచే నిన్నుఁ దుత్తునియ లొనర్చెద.

మహా:—(తనలో) జానకీవిరహమున నాఁతడును, జానకీమోహమున నీతఁడును ఉన్మత్తులగుచున్నారు. (ప్రకా) దేవా! ఆ చెట్టు జడపదార్థము గదా? అది యెట్లు చెప్పఁ గలుగును?

సీత:—అనలా! రాక్షసునకుఁ జిక్కి పక్కి కైవడి వాపోవు మని నాకును, నా జాడ దెలియక యున్మత్తునివలెఁ జింత నందు మని యతనికిని మూఁడుబంతుల వ్రాసెనుగాబోలు నా మాయదారి బ్రహ్మ.

అనల:—చెలీ! చింతింపకుము. కొలఁది కాలముననే నీ నాథుని సందర్శింపఁగలవు.

సీత:—ఇంతవఱకు నానాథుఁడు జీవించియుండునా?

అనల:—సఖీ! వృత్తాంత మంతయు నీ నాటకమే తెలుపును.

రాము:—శ్వశూర్భిత్ వ్యాయమ్మున నీ పొన్నచెట్టు నన్నుఁ బిలచియు మిన్నకున్నది. కాని మ్మా కొండ నడిగెద.

సీత:—అక్కటా! నన్ను రాక్షసుఁ డెత్తుకొనిపోయినాఁ డని యెవరు చెప్పుదురు? మనోహరుఁ డాసంగతి నెఱింగినఁ గదా నేను దుఃఖసాగరమునుండి తరింపఁ గలుగుట!

లక్ష్మ:—అన్నయ్యా! ఊఱక నీ చెట్టుగుట్టల నడిగిన లాభమేమి?

గీ॥ కంటికిని ఱెప్పయుం బోలె గడ్డిపూల
చేతఁ బ్రియమారఁ బెంచుటఁ జేసి లేడి
పిల్ల లీవైపునకు సాగి వెళ్ళుచున్న
వవిగో! వదినె చందముఁ దెల్పునవియుఁ బోలె.

కావున నీ దారి నేగుదము రమ్ము. (పరిక్రమింతురు.)

రావ:—(క్రోధముతో) ఈ లేడిపిల్లలను దప్పక నఱికివేయవలెను. అవి దక్షిణపు దిక్కును సూచింపుచున్నవి. (కత్తిదూసి లేవ నుంకించును.)

మహా:—(కూర్చుండబెట్టి) మహారాజా! ఇది నాటకము. ఏల యీ చాపల్యము? గోడలకునుఁ జెవు లుండును. ఎవరైన విన్న నవ్విపోవుదురు. సంరంభము మాని యవధరింపుఁడు.

సీత:—(ప్రేమతో) నాకుఁ బుత్రప్రాయము లగు నీ లేడిపిల్లలే మొదట నార్యపుత్త్రునకు దారిఁ జూపి తల్లిఋణమునుఁ దీర్చుకొనుచున్నవి.

రాము:—తమ్ముఁడా! ఈ పువ్వులు మీ వదినె ధరించినవి లాగున నున్నవి చూడుము. (చూపును.)

లక్ష్మ:—ఔను. దేవిచేతనో సిగ్గుపడి తలవంచుకొనఁగా దేవి కీలడనుండి యివి జారి యుండవచ్చును.

రావ:—ప్రమాదవశమున నీ పూలు పడిపోవుటఁ జూడనైతిని.

సీత—న న్నీ రక్కసుఁడు బలాత్కారముగ నెత్తుకొనివచ్చునప్పు డివి రాలియుండును.

రాము:—(నాలు గడుగులు వెనుకకు వైచి) తమ్ముఁడా! ఏమిది? విరిగిపోయిన రథము—మృతిఁ జెందిన సారథి—తుత్తునియ లైన ఖడ్గాద్యాయుధములు—తెగిపోయిన ధనుస్సు—ఇచ్చట నన్నియు రణచ్ఛిద్రములు కన బడుచున్నవి.

లక్ష్మ:—జానకి నిమిత్త మిరువురు వీరు లిచ్చట యుద్ధము చేసియుందురు.

రావ:—జానకి నెత్తుకొనివచ్చుచున్న నాకు మధ్య నడ్డుపడిన యా జటాయువునకుఁ దగిన శాస్తిఁ జేసితిని

సీత:—హా! తండ్రీ! పక్షిరాజా! అట్లు నాకై యుద్ధముఁ జేసియు ధర్మఫలము నంద లేక పోయితివి.

అనల:—ముల్లోకములందును దశాననుఁడే బలవంతుఁడు. ఏమి చేయుదుము?

రాము:—(తత్తరపాటుతో) లక్ష్మణా! విల్లు విల్లు!!

లక్ష్మ:—అన్నగా రేలకో యకాలమున విల్లు నందిమ్మనుచున్నారు.

మహా:—భ్రుకుటీభీషణముఖుండును, హుంక్రియాగర్భకంధరుండు నగు నీతఁ డొక్క-తరి ముల్లోకముల దహించివేయున ట్లున్నది.

రావ:—(అసూయతో) ఈ కృపణునిఁ బొగడిన మన కేమి కీర్తి గలుగును. వీని సమక్షమును వదలి ఇంకొక చోటఁ గూర్చుందము. (లేచును.)

మహా:—మహారాజా! ఇది నాటకము గదా! కూర్చుండుము.

(కూర్చుండఁబెట్టును.)

సీత:—ఆర్యపుత్రుని యీ సంరంభ మెందుకో?

రాము:—

గీ॥ ఏనుఁగు మృణాళినిం బోలె నిచట నాదు
సతిని భక్షించి పక్షివేషమున రాక్ష
సుం డెవఁడో చూడు మొక సెద్ద కొండ వ్రాలెఁ
దమ్ముఁడా! వీఁడె పడియుండె వారి నడుమ.

కావున వీనిం జంపెద.

రావ:—(క్రోధముతో) అరే! ఎవఁడురా మదీయమనఃప్రియ యగు జానకిని మ్రింగి వైచి మత్కరాళకరవాలమున కెఱగాఁ జూచునది?

మహా:—దేవా! అతనికిఁ బట్టిన పిచ్చియే మీకునుఁ బట్టినదా యేమి? ఆమె నశోక వాటికయందు నిరోధించి యుంచితిమి గదా?

సీత:—న న్నేరాక్షసుఁడును మ్రింగలేదు. ప్రాణనాథునకు విరహదుఃఖము గలిగించుట కింకను జీవించియే యున్నాను.

లక్ష్మ:—(ముందుకు జూచి) అన్నా! ఏల యీ యకాండతాండవము? అతఁడు పూజ్యుఁడగు జటాయువు వలె నున్నాఁడు

(తెరలో)

వత్సా! రామభద్రా! సీత నెత్తికొనిపోవు నాతని నెదిరించి ముప్పాతిక మూఁడువీసము లాయువునుఁ బోగొట్టుకొంటిని. చచ్చిన పాము నేల చంపఁ జూచెదవు.

రావ:—ఏమీ రాజపుత్రులు వచ్చువఱకు నీ ముసలిగ్రద్ద ప్రాణములతోనే యున్నదే? ఇతఁడు చనిపోయెనను నమ్మకముతో విడచి వచ్చితిని.

సీత:—(సంతోషముతో) ఈ జటాయువు నా సంగతిఁ జెప్పివేసినాఁడు (ఆలోచించి) ఐన నన్ను విడిపించుట కింతవర కేల యత్నింపలేదో?

లక్ష్మ:—(సమీపించి) హా తండ్రీ! శకుంతరాజా! నీ కింతటి యవస్థ కల్గినదా?

రాము:—ఆర్యా! చెప్పఁగల యోపిక కలదేని చెప్పుము.

మ॥ ఎవఁడా కన్నపుదొంగ? శౌర్యసుభగుండే యతాన్నోకో? వాని పే
రెవ? రూ రెయ్యది? మేము లేనితఱి ని టేలా? జనుల్ నల్వురున్
'తువ్వు 'తువ్వం'చు మొగంబునం దుమియ నీ దుష్కార్యముం
జల్పె; వే
గ వచింపంగదవయ్యా, ఆ ఖలుని - ఆ కష్టాత్ము మాతో నికన్.

రావ:—హుష్! ఇటువంటి వారల ననేకమందినిఁ జూచితిని. ఱెఱచుకుక్క కఱువ నేరదు? సంగతియంతయుఁ జెప్పని మ్మా పక్షిని. ఈ లంకేశ్వరుఁడు జడి యనా రేమి? ఇంతమాత్రమున. నాకు వచ్చిన నష్టమును వానికి వచ్చిన లాభమును లేదు.

సీత:—(ఆతురతతో) అసలే తల్లప్రాణము తోఁకకు వచ్చియున్న యితఁడేమియుఁ జెప్పనేలేఁడేమో గదా?

(తెరలో)

వత్సా! జానకి నపహరించినవాఁ డొక రాక్షసుడు. ఆ కష్టాత్ముఁడు పులస్త్య వంశము చెడఁబుట్టిన మహానీయుఁడు. అతనిని రావణుఁ డందురు.

రావ:—ఈ పక్షి నాపేరును సైత మెఱింగించెను. (నిట్టూర్చి) ఱెక్కలను, కాళ్ళను నరికివేసితిని గాని యప్పుడు వీని శిరశ్ఛేద మేందుకు జేయనైతిని?

సీత:—ఊరక పేరును జెప్పినంతమాత్రమున లాభమేమి?

రాము:—తండ్రీ! మిగులును పూర్తిసేయుము.

లక్ష్మ:—(కన్నీటితో) ఇంకను మిగు లేమి? మనమే మిగిలితిమి.

రాము:—(ఆతురతతో) మిగిలినదానిం జెప్పకయే యీతఁడు మరణించెనా? (సమీపించి) హా తండ్రీ! జనకసఖా! హా పంచవటీనివాసా! హా ప్రశంసా పాహసాహయ్యా! హా గరుడాగ్రజకులప్రదీప!

గీ॥ సిరులు పీడిన, నడవిఁ గాపురముసేయ
వలసినను, దండ్రి పోయిన, భార్య కానఁ
బడకయున్న నింతగ దుఃఖపడను; కాని
మఱల నీవంటి మిత్రుండు దొఱుకునొక్కొ!

మహా:—మహారాజా! ఇంతటి శోకమునకుఁ గారణము నీవె గదా?

రావ:—తాటకాకరాళిసుబాహుమారీచాదుల భంగముచేతను, శూర్పణఖ ముక్కు చెవులనుఁ గోలుపోవుటచేతను నాకు మాత్ర మింతటి దుఃఖము కలుగలేదా రేమి? నే నప్పు డనుభవించితిని. మీ రిప్పు డనుభవించుచున్నారు. (సంరంభములో)

గీ॥ ఇపుడె సౌమిత్రిశిరము ఖండించివైతు
వెలి కుబికి పొంగి పొరలెడు వేఁడి వేఁడి
క్రొత్తనెత్తురు కడుపారఁ గ్రోలుగాఁత!
శూర్పణఖ కోపవహ్నికిఁ దర్పణముగ.

(ఖడ్గపాణియై లేచును.)

మహా:—దేవా! ఏల యీ సంరంభము. ఇది ప్రేక్షణికము కదా! (నివారించును.)

సీత:—నన్నపహరించినది రావణుఁడని చెప్పియు లంకాపురమతని నివాస మని చెప్పకయే మరణించెనే యీ జటాయువు? మందభాగిని నగు నే నేమి చేయుదును.

లక్ష్మ:—సోదరా! ఇది దుఃఖమునకు సమయము గాదు. శత్రువుల లేకుమణచు నుపాయ మాలోచింపవలెను.

రాము:—(క్రోధముతో)

చ॥ శరమును బంపినంతటనె జానకి దొంగిలి నట్టి దుష్కృత్యా
చరుని నెందు డాగిననుఁ జంపు సురాసురు లడ్డువచ్చినన్
సరియె సబంధుమిత్రముగ, చోన నొసంగి యతండె దీనుఁడై
శరణని కాళ్ళమీఁదఁబడి సారెకు వేఁడకయున్న నుద్ధతిన్.

రావ:—అరే వృథావాచాట! వృత్రారిప్రముఖ నిఖిలదిక్పాలక నికాయమారణహోమ సోమయాజి యగు నీ లంకేశ్వరుని యెడలనా నీ యాటలు?

లక్ష్మ:—ఆర్యా! శాంతింపుము శాంతింపుము.

చ॥ "కలఁగి యరాక్షసం బగుఁనుగాక!" యటం చొక బాణమేయ నా
పలలుని బంధుమిత్రపరివారముతోడుత దెచ్చి నీ పద
నలి నిడు; నౌ, నకారణము సాధులు బాలురు నాఁడువాండ్రు వృ
ద్ధులు హతమార రే? ఇనుముతో ననలంబును దెబ్బ తిన్నటుల్॥

కావున నది దీనజనశరణ్యుండ వగు నీకుఁ దగదు.

సీత:—లక్ష్మణా! సమయమునకుఁ జక్కగాఁ బ్రబోధించితివి.

రాము:—అట్లైనచో ముందుగా నీ జటాయువున కగ్నిసంస్కారముఁ జేసిరమ్ము.
పిదప దక్షిణదిక్కుగాఁ బోయి యా రక్కసుని యునికిఁ గనుగొందము.

లక్ష్మ:—చిత్తము. (నిష్క్రమింతురు.)

రాము:—

గీ॥ "ఈ విలాసము లీ యద్ద మేమి చెప్పు?
బోటి! నాదు చూపుల పైన గీటు వెట్టి
వన్నెఁ జూచుకో"మ్మనిన యప్పటిది నీదు
వలపు వాల్చూపు నా కింకఁ గలుగునొక్కొ!

సీత:—అనలా! ఈ ప్రణయకథ నా హృదయమర్మముల నంటఁగోయుచున్నది.

గీ॥ దైవ మనువాఁ, డొకం డుంట తథ్యమేని
పరసతి - నయోనిజను - పతివ్రత నొకండు
రావులంబెట్టఁ గాపాడరాఁ డదేల?
కంచెయే చేను మేసినఁ గలదె దిక్కు?

(తెరలో)

హా సోదరా! జటాయువున కగ్ని సంస్కార మొనర్చి వచ్చుచుండగా వీఁడెవఁడో నన్ను లాగుకొని పోవుచున్నాఁడు.

రాము:—లక్ష్మణుఁ డాక్రోశించుచున్నట్లున్నది! తమ్ముఁడా! నిన్నుసుఁ బట్టునంతటి శక్తిమంతుఁడా యతఁడు?

మహా:—దేవా! నీ యాజ్ఞ ననుసరించి వనమధ్యమునఁ గాచుకొనియున్న దను కబంధుఁడే కాఁబోలు నతఁడు?

రావ:—కావచ్చును. (సంతోషముతో) లాగుకొనిపోయి భక్షించును గాక!

సీత:—అక్కటా! కష్టములపైనఁ గష్టములు. లక్ష్మణు నరికట్టుచున్నవాఁ డెవ్వఁడో కదా!

(తెరలో)

కబంధాకారమున నున్న యొక్క రక్కసుఁడు కలశాబ్ధి మంథశిఖరిస్థూలాయితము లగు తన చేతులతో నన్నుఁ జెనవైచి యీడ్చుకొనిపోవుచున్నాఁడు.

రాము:—ఓహో! ప్రమాదము! (పరిక్రమించి) ఆ రాక్షసుఁ డొక చిటుకలోఁ దమ్ముని కత్తి కెఱ యయ్యెను.

సీత:—వత్సా! లక్ష్మణా! భాగ్యవశమున మృత్యుముఖమునుండి విడివడితివి.

లక్ష్మ:—(ప్రవేశించి) ఈ యశరీరవాణి యేమో యనుచున్నది.

(అంతటఁ గబంధుని జీవుఁ డాకసమునఁ బ్రవేశించి)

రామచంద్రా! జానకి లభించుట కుపాయముఁ జెప్పెద వినుము. కిష్కింధలోని ఋశ్యమూకపర్వతమున వానరరా జగు సుగ్రీవుఁడు కలఁడు. అతనితో

నెయ్య మొనర్చి యతని యన్న యగు వాలిం జంపి యా రాజ్యమున నాతనిఁ బ్రతిష్ఠింతువని నీ పని నెఱవేఱును. ఈదారి పంపాసరస్సుమీదుగాఁ గిష్కింధకుఁ బోవును. స్థూలశిరోమునిశాపమునఁ గబంధుఁడనైన నాకు శాపమోక్షము గల్గించినందుల కిది నేఁ జేయు ప్రత్యుపకారము. ఇఁక నే నేగుచున్నాను. (నిష్క్రమించును.)

రాము:—తమ్ముఁడా! ఇతఁడు చెప్పిన చొప్పున నడుచుకొందము. (పరిక్రమింతురు.)

రావ:—కబంధుఁడును విపక్షపక్షమునఁ జేరినాఁడుగా!

మహా:—భౌతికశరీర మున్నంతవఱకును లేదు.

సీత:—అమ్మయ్య! ఇప్పటికి నా గుండె కుదుటఁబడినది.

రావ:—ఇది కాని పోని రగడ. ఎంతటి భార్గవజేత యైనను దుర్ధర్షుఁ డగు వాలిని జంపుట బూటకము. అందువలననేగదా యీ క్షత్రియకుమారుల మట్టుబెట్టు పని నతనిపైనుంచితిని.

మహా:—(తనలో) ఇతని విజయాశంసన మంతయు వాలియం దిమిడియున్నది. వాలి వధను విని యిఁక నేమి సేయునో? (ప్రకా) ఔ నట్లే.

సీత:—(స్మృతి నభినయించి) రావణు డెత్తుకొనిపోవుచుండఁగా నొక పర్వతశిఖరముపై నైదు కోఁతులను జూచిన జ్ఞాపక మున్నది. వారిలో నొకఁడు సుగ్రీవుఁ డగునా యేమి?

అనల:—వారిలో నొక్కఁడును నిన్ను రక్షింపరాలే దేలనో?

సీత:—ఎట్లు రక్షింపఁగలరు? విమానము వాయువేగమనోవేగముల నతిశయించి పర్వులెత్తుచుండ వారి కవకాశ మెక్కడిది?

లక్ష్మ:—(ముందునకుఁ జూచి) ఇదియే సంపాసరస్సు.

రాము

గీ॥ తనువు పచ్చికపులకలఁ దానమాడ
గట్టు తనచుట్టుఁ జేతులఁ గలిపియుండ;
విరిసి కందళ్ళలను గాన్క వెట్టుచుండెఁ;
ప్రణయినియుఁ బోలె నదిగో! పంపాసరస్సు.

హా! జానకి నాయందలి ప్రేమచే నెట్లు జీవించియున్నదో గదా! (మూర్ఛిల్లును)

రావ:—ఈ లంకాధినాథుఁ డెంతవఱకు దయామయుఁడైయుండునో యంతవఱకు రాక్షసులచే నభిరక్షితయై యుండఁగలదు. (చూచి) మూర్ఛిల్లిన యీతఁడు మరల లేచునా యేమి? లేవకుండిన బాగుండును.

సీత:—హా! ఆర్యపుత్త్రుఁ డెంత కష్టపడుచున్నాఁడు?

లక్ష్మ:—(తనలో) ఈ సరోవరలక్ష్మినిఁ జూచుటచే వదినె జ్ఞప్తికి వచ్చి యన్నగారు మూర్ఛపోయినారు. (ప్రకా) అన్నయ్యా!

గీ॥ వదినె నెత్తుకపోయిన వాని వృత్త
మెల్లఁ దెలిసికొంటిమిగదా! యిట్లు గాసిఁ
జెంద నేమగు యత్నముల్ సేయకుండ?
వెలఁది కన్నీట దొఱకునే? వెఱ్ఱి గాక.

రాము:—(మూర్ఛ దేఱి) ఋశ్యమూకపర్వత మిక్కడి కెంత దూర మున్నదో?

లక్ష్మ:—సోదరా! అనతిదూరమున నొక్క భిక్షువు వచ్చుచున్నాఁడు. అతని నడుగుదము.

(అంతట భిక్షుకవేషమున హనుమంతుఁడు ప్రవేశించును.)

హను:—వీరే నేను చూచినవారు సమీపించెద. (పరిక్రమించును.)

రావ:—వాలియే వీరలఁ జంపుట కిట్లు వచ్చెను.

సీత:—అనలా! అపాయ మపాయము.

అనల:—అస్థానమున నిట్లు దుఃఖిల్లెద వేల?

సీత:—బిచ్చగాని వేసమున న న్నా రాక్షసుఁ డపహరించినట్లే యితఁడు నా మనోనాథునిఁ జంపవచ్చినట్లున్నది.

అనల:—వెఱ్ఱిదానా? అట్లేన్నటికిని సంభవింపదు.

లక్ష్మ:—అయ్యా! సుగ్రీవుని వాసస్థానమగు ఋశ్యమూకపర్వతము తెలియంగుదువా?

హను:—(తనలో) వాలియే యిటకంపినచో వీరి కా గిరిరాజము తెలియకుండునా? మరియు వీరి మాటలచే నా యంతరాత్మ చల్లఁబడుచున్నది. (ప్రకా) మేఘపంక్తులు తలపాగవలె నమరియుండఁ గకుబటవి యను కవచముఁ దొడిగి సెలయేటి వాలును ధరించి వీరాధివీరునిఁబోలి యా కనఁబడు పర్వతమే ఋశ్యమూకము. మీ రెవరో నే నడుగ వచ్చునా?

రావ:—(తనలో) ఇతఁడు వాలి కాఁడు. (ప్రకా) ఎఱుఁగవా? వీరిలో నొకఁడు ఖరుని బొట్టను బెట్టుకొనిన పాపాత్ముఁడు. రెండవవాఁడు శూర్పణఖ ముక్కుచెవులను గోసిన మహాపరాధి.

సీత:—ఇతఁడు నే ననుకొన్నట్లు భిక్షుకరూపుఁ డగు రాక్షసుఁడు కాఁడు.

లక్ష్మ:—ఈతఁడు దశరథమహారాజు గారాబుకొమరుఁ డగు రాముఁడు. నే నతని తమ్ముఁడను. నన్ను లక్ష్మణుఁ డందురు. ఈతఁడు పితృశాసనమునఁ బదునాలుగేం డ్లరణ్యావాసము సేయవచ్చెను. దురదృష్టవశమున సీతని సతీమణి నెవ్వఁడో రావణుఁడఁట! దొంగతనముగ నెత్తుకొనిపోయెను.

హను:—అటులనా? సుగ్రీవుని మంత్రిని నన్ను హనుమంతుఁ డందురు. రామచంద్రా! మా సుగ్రీవుని సతీమణి నతని యన్న యగు వాలి యపహరించెను. వాలినిఁ జంపి మా ప్రభువతనునిఁ దద్రాజ్యమునఁ బ్రతిష్ఠింతువేని నతఁడును నీకు సాయపడఁగలడు.

రావ:—(కోపముతో) ఈ బిచ్చగాని వాచాలత్వ మంతకంతకు మితిమీఱుచున్నదే? నాచంద్రాయుధ మెక్కడ? మొదట నీతని నఱికివేయవలెను. (ఆలోచించి) నాకీ తొందఱ యేల? వాలినిఁ జంపియుంటిని గదా? ఆతఁడే వీరల నంద ఱను ద్రుంచివేయఁగలఁడు.

మహా:—పేదవాని కోపము పెదవులచే టన్ని యెఱింగియు మీరింతగా హడావుడి పడెద రేల?

సీత:—ఇఁక భయము లేదు. వీరి కెడతెగని మైత్రి కలిగినది.

రాము:—అటులనే కానిమ్ము, ఋశ్యమూకమునకు దారితీయుము.

(అందఱు పరిక్రమింతురు.)

రాము:—ఇది యేమి? త్రోవలో పెద్ద కొండవలె నున్న దీ యెముకలప్రోగు!

హను:—ఇది వాలిచే నిహతుఁ డైన దుందుభి యను రాక్షసునిది.

రాము:—మన దారికడ్డముగ నిది యేల? కాలఁ దన్నెదను. (తన్నును.)

లక్ష్మ:—(ఆశ్చర్యముతో) కాలి బొటనవ్రేలితోడనే దీని దశయోజనముల దూర మెగురగొట్టినాఁడే!

హను:—(తనలో) ఆహా! తాడి నెక్కువానినిఁ దలఁ దన్ను వాఁ డుండును. ఈరాకొ మరుఁడు చాల బలము గలవాఁడు. (ప్రకా) దేవా! మున్ను యుద్ధా వసానమునఁ జనిపోయిన యీ దుందుభిని వాలి తన చేతులతో నెత్తి యొక్క యామడ దూరము మాత్రమే విసరఁగలిగెను.

రాము:—(ముందునకుఁ జూచి) శరవిదారితదర్శితవివరము లగు నీ తాళవృక్షము లేడును నెవరివి?

హను:—ఇవియును వాలివే.

లక్ష్మ:—వీటి నన్నిఁటి నొక్క బాణముచేతనే ద్రుంచఁగలఁ డార్యుఁడు. చూచు చుండుము.

రాము:—(శరమును వదలును. తాళ వృక్షము లేడును కూలిపోవును.)

హను:—(ఆశ్చర్యముతో) ఆహా! ఏమీ నైపుణ్యము! (ముందునకుఁ జూచి) అల్లదే సుగ్రీవుఁడు తన మంత్రులతోఁ గొండ దిగి వచ్చుచున్నాఁడు.

రావ:—(ఆశ్చర్యముతో) ఇంతటి మహాబలశాలి యగు నీతని ముందఱ వాలి మాత్ర మేపాటివాఁడు? (ఆలోచించి) అంతకున కంతకుం డగు వాలి రాలవానఁ గురియుచో నాతని జయింపఁగలవాఁ డెవ్వఁడు?

(అంతట సుగ్రీవుఁడు ప్రవేశించి రామునకు నమస్కరించును.)

రాము:—వయస్యా! నీకుఁ గుశలమా?

సుగ్రీ:—నీచే 'వయస్యా!' యని పిలువఁబడుటకంటెఁ గుశల మేమి కలదు?

రాము:—మిత్రమా! విశ్రవస్సుతుఁ డగు రావణు నెఱుంగుదువు గదా? అతని నివాస స్థాన మెద్ది?

సుగ్రీ:—అతని పేరును వినుచుందుము గాని యూ రెఱుంగము.

సీత:—అనలా! ఈ వానరప్రభువును లంకేశ్వరుని స్థితిగతుల నెఱుంగఁడా? ఆర్య పుత్రున కిఁక నీ సంగతిఁ జెప్పువా రెవరు?

అనల:—సుగ్రీవుని భటుఁ డెవఁడైన వచ్చి చూచిపోయి నీ సంగతి నతనికిఁ దెలుపఁ గలఁడు.

హను:—అతఁ డీయన సతీమణి నెత్తుకొనిపోయినాఁ డఁట!

సుగ్రీ:—ఆకసమున నెవఁడో యొక రాక్షసుఁ డొక కన్నియ నెత్తుకొనిపోవుచుండ నాభరణకలిత మగు నీ యుత్తరీయము మా కొండపైఁ బడినది. (చూపును.)

రాము:—(చూచి) ఈ యుత్తరీయము మా సీతదే! (తీసికొనును.)

సీత:—నా యాభరణములను మూటగట్టి జారవిడచిన యీ యుత్తరీయము భాగ్యవశమున మనోహరుని జేరినది.

రాము:—(శోకావేగములతో)

ఉ॥ జూదము నాడి యోటువడి చూడ్కులు కానుక వెట్టి యంతతోఁ
బో దనఁ బైడిచేలములు భూషణముల్ తుది కెంచఁ దానునుఁ
నాదగు సొమ్మె యాట నిఁక నాతలిదండ్రు లొసంగినా 'రిదో
నాది' యటంచు జానకి పణంబుగఁ బెట్టును దీని నెప్పుడున్.

రావ:—ఈతనికిఁ దహతహ పెచ్చుపెఱుగుచునే యున్నది గాని ప్రాణములు మాత్రము పోవుటలేదు.

రాము:—జానకి యాభరణములను గన్నులారఁ జూచెద. (మూట విప్పును.)

రావ:—ఈ రాకొమరుఁ డీ యాభరణములను జూచుటతోఁ దప్పక సమయఁగలఁడు.

సుగ్రీ:—ఈ నగలను జూపి యీ మహాత్మునకు మఱల దుఃఖముఁ గల్గించితినే?

సీత:—(ఆవేగముతో) ఆర్యపుత్రుఁడు జీవించునా?

రాము:—(స్మృతికిఁ దెచ్చుకొని తనలో)

గీ॥ స్పర్శసౌఖ్య మెక్కడఁ గొంచెపడునో యనుచుఁ
గలఁగి భూషణములఁ దీసి కౌఁగిలించు

కొందువుగదా? సఖీ! యెట్టు లుందు విపుడు
తరులు, కొండలు, నదులు నీ దవ్వొనర్ప.

(ప్రకా) సౌమిత్రీ! నన్నుఁ బట్టుకొనుము. (మూర్ఛిల్లును.)

రావ:—(సంతోషముతో) ఇఁక నేమి? వీని జీవిత మింతటితోసరి. (నిలుచుండును.)

మహా:—దేవా! మఱచితిరా? ఇది నాటకము. (కూర్చుండఁబెట్టును.)

సీత:—ఎంత కష్ట మెంత కష్టము?

గీ॥ అడవులకు వచ్చునాఁడు నాలైదడుగులు
వేసినటు వేసి 'యింకె నెంత వెళ్ళవలయు'
ననుచు మఱిమఱిఁ బ్రశ్నింప నదియె మొదటి
సారిగాఁ బొంగి పొరలు కన్నీరుఁ గన్న
ప్రాణనాథుని మఱల నేఁ బడయఁగలనె?

(మూర్ఛిల్లును.)

అనల:—చెలీ! ఊఱడిల్లు మూఱడిల్లుము.

లక్ష్మ:—అన్నయ్యా! ఊఱడిల్లుము. అంతకంతకు వట్టి పిచ్చిలోఁ బడిపోవుచున్నావు?

రాము:—(మూర్ఛదేరి) సుగ్రీవా! మన మీ క్షణమునుండియుఁ బ్రాణమిత్రులము. (సుగ్రీవుని చేతిలోఁ జేయి నుంచును.)

(తెరలో)

ఓరీ! దురాత్మ! నా తమ్మునితో సంధిచేసుకొని న న్నెదిరించెదవుగా? ఇదె వచ్చుచున్నాను. మీ కీర్తిలతికను మొదలంటఁ గోసివైచుటకు—

సుగ్రీ:—వాలి స్వయముగ నే వచ్చి యిట్లనుచున్నాఁడు.

లక్ష్మ:— (కోపముతో) ఓరీ దుష్టా! ఒక్క కోఁతియా మా కీర్తిలతిక నంటఁ గోయునది.

సీత:—(మూర్ఛఁదేరి) మరల నిది యొక పుట్టిమునుక వచ్చినదే.

(మరలఁ దెరలో)

ఆహాహా! ఒక్క పూఁబోడి నెమ్మొగము విరూపముగఁ జేసినంతమాత్రమున నొక పెద్ద శూరుఁడ ననుకొనుచున్నావా? విరాధునిఁ జంపుట యొక ఘుణాక్షరన్యాయము. నీతో నేమి? రామభద్రా! చేవ గలదేని నన్నెదిరింపుము. నా శిలాపాతమున స్రవించు రక్తధారలచే జానకీవిరహాగ్నిని జల్లార్చుకొనుము.

రావ:—రాముని పని ముగించుటకే వాలి వచ్చినాఁడు.

సీత:—అనలా! మీఁద నేమగునో గదా? నా మనస్సు చేయివెట్టి కలఁచిన ట్లున్నది.

అనల:—రఘుకుమారుఁడే వీనినిఁ బరిభవింపఁగలఁడు.

రాము:—ఓరీ వాలీ! ఊఱక లట్టాభట్టీయము లేల? చచ్చుటకు సిద్ధముగ నుండుము. (నిష్క్రమించును).

(తెరలో)

హా! దురదృష్టవతిని. నా భర్త రాయి రువ్వియు రువ్వక ముందే రాముఁడు దర్వీకరభీకరమార్గణమును వదలినాఁడు. అది నాకొంపకుఁ జిచ్చుపెట్టనే పెట్టినది. అయ్యో! !

సుగ్రీ:—వాలి చనిపోయిన ట్లున్నది. అందులకే తార యిట్లు విలపించుచున్నది.

రావ:—రామహతకుఁడు వాలినిఁ జంపెనా? ఇది యెట్లు నమ్మఁదగును? నీటిపైఁ బాషాణము తేలునా? (క్రోధముతోఁ) ఆహవవిమర్దనిర్దయానిర్ఘాతదిక్పాలక గణుం డగు రావణుని యెదుట బూటకపు నాటకము లాఁడు నీ యప్సరోంగ నల తలల గొఱిగింప నాజ్ఞాపింతునా.

మహో:—(దోయిలించి) శాంతింపుఁడు దేవా! శాంతింపుఁడు. దీనిని భగవానుఁడు శుక్రాచార్యుఁడు వ్రాసెను. ఇం దసత్యముండదు.

రావ:—ఇది నిజమే. (శోకముతో) హా ప్రియసఖా! హా దుందుభిదానవ సమరసం దర్శిత బాహువిక్రమ! కపికుల చక్రవర్తీ!

గీ॥ మన ఖరాధుఁడు మరణించినను, ఖరుండు
సమసినను, నీ పరాక్రమక్రమముఁ జూచు
కొని జిగీషామహాసౌధమును రచించు
కొంటి నది నేఁడు నిలువునఁ గూలిపోయె!

మహో:—సీతపుట్టుక లంకచేటునకే కాఁబోలు!

లక్ష్మ:—దీనజనశరణ్యుఁ డగు సోదరుఁడు వాలిని సంహరించి వచ్చుచున్నాఁడు.

రాము:—(ప్రవేశించి) సుగ్రీవా! ఇఁక గుండెమీఁదఁ జేయివైచికొని హాయిగ విశ్ర మింపుము.

లక్ష్మ:—అన్నగారి ప్రతిన నెఱవేఱినది. నీయదియే యవశిష్టము.

సుగ్రీ:—అంతయు భవదనుగ్రహమే! మీ రీ ప్రస్రవణపర్వతముపై నివసించియుం డుడు. సీతను వెదకుట కిదే వానరసేన నంపుద.

లక్ష్మ:—అట్లే చేయుదము. (నిష్క్రమింతురు.)

రావ:—ఇఁక నుపాయ మేమి?

సీత:—(సంతోషముతో) అబ్బా! ఈ రోజున కొండ సెక్కినట్లున్నది.

(తెరలో)

మిత్రమా! శుకుఁడా! చూచుటలేదా? ఆ సంపాతివలన సీత సంగతి దెలిసుకొని లంకాప్రయాణోన్ముఖుఁడై హనుమంతుఁడు సముద్రము నుల్లఘించుచున్నాఁడు.

(మరలఁ దెరలో)

శార్దూలా! చూచితివి? మన మహారాజుగారితోఁ జెప్పి వత్తద.

(అంతర్నాటకము సమాప్తము.)

రావ:—శుకశార్దూలుర పలుకులవలె నున్నవే?

చ॥ ధరణిజమీఁది మోహమునఁ దప్పు నెఱుంగక చారదృష్టియున్
మఱచిన నన్నుఁ దెల్పుటకు మంత్రులు నాటకకల్పనంబుఁ జే
సిరి; కడు మంచి సాధనమె చేతులు కాలిన మీఁద నాకుకై
పరువిడ నేమి లాభ? మిఁక వర్తిలఁగావలె జాగరూకతన్.

మహా:—(చిఱునవ్వుతో) మంత్రులు చరితార్థులైనట్లే.

సీత:—సఖీ! అనలా! హనుమంతుఁడు సముద్రము నుల్లంఘించియుండును. మన మశోకవనమున కేగుదము రమ్ము. (సీతయు అనలయు నిష్క్రమింతురు.)

రావ:—మహాపార్శ్వా! ఎల్లరు నప్రమత్తులై యుండవలసిన దని నా యాజ్ఞగాఁ బరిజనులకుఁ దెలుపుము. నేనును హనుమంతుని విషయమై మంత్రులతో నాలోచించెద. (ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది శ్రీ వెంకట పార్థసారథి కవి ప్రణీతంబైన విచిత్రరాఘవమునఁ

బంచమాంకము.





# విచిత్రరాఘవము

## షష్ఠాంకము.

దృశ్యము:—లంకాపట్టణములో నొక వీధి :

[అంతట శూర్పణఖ ప్రవేశించును.]

శూర్ప:—హా సోదరా! రావణా! హా ఆర్య కుంభకర్ణా! వత్స మేఘనాథా! మరణించితిరా? ఏమి సేయుదును? మందభాగ్యురాలను. మున్ను హనుమద్వాలాగ్నిచే లంకాపురగృహనికురుంబమువలె నీ శోకముచే నా హృదయము దహించుకొని పోవుచున్నది. ఆహా! ఏమా రఘుకుమారుని నైపుణ్యము! వింట శర మెప్పుడు తొడుగునో యెప్పుడు విడచునో యేరికినిఁ దెలియదు. తాళఫలములవలె శత్రుశిరములు క్రిందఁబడుచుండుట మాత్రము కానుపించును. కానిమ్ము! రాత్రించరకాళరాత్రు లగు నీ రాజపుత్రులపైఁ గసిఁ దీర్చుకొనక మానను. విభీషణుఁడు మానాభిమానములను విడనాడి శత్రుపక్షముం బ్రవేశించి చేతులారఁ గొంపకుఁ జిచ్చు వెట్టినాఁడు. అతనికి రాజ్యము వచ్చిన దని నా కెంత మాత్రమును సంతసము లేదు. రామలక్ష్మణులు వానరులును రాక్షసులును వెంబడింపఁ బుష్పకవిమానము నెక్కి నందిగ్రామమునకుఁ బ్రయాణమై యీ వార్తను భరతుని కెఱింగించుటకు ముందుగా హనుమంతునిఁ బంపిరఁట! హనుమంతుఁడు భరతున కీ సందేశము నందఁజేయకముందే తాపసీవేషమునఁ బోయి యాతని కెద్దిరయేని నప్రియముఁ జెప్పుదును. అది విని భరతుఁడు తమ్మునితోఁగూడ శరీరమును విడిచిపెట్టును. రాముఁడు నా యన్నల నిట్లు్వరఁ జంపినందుల కిది ప్రతీకారము కాఁగలదు.

(నిష్క్రమించును.)

ఇది విష్కంభము.

దృశ్యము:—నందిగ్రామములో భరతుని పటకుటీరము వెలుపల.

[అంతట భరత శత్రుఘ్నులు ప్రవేశింతురు.]

భర:—తమ్ముఁడా! శత్రుఘ్నా!

ఉ॥ మాయికుఁ డౌచు మైథిలకుమారిని దొంగిలిపోయినట్టి యా
కోయను బట్టి చంపుటకుఁ గూరిమితో మన మాటమీఁదుగా
సాయముసేయ వచ్చిరి విశాంపతు లాయత తేజు లౌచు నా
యా యవనీశులం దగినయట్టుల నందఱ గౌరవింపుమా!

నేనును వారు తెచ్చిన యుపాయనముల నన్నగారి పాదుకల యెదుట నుంచి పిదపఁ గోశగృహమునఁ జేర్చెదను.

శత్రు:—అన్నయ్యా! మీ యాజ్ఞచే రాజుల నందఱ నిదివఱకే గౌరవించియుంటిని. మీరును వారివారి యుపాయనముల నింతకుముందే కోశగృహమునఁ జేర్చితిరి. మఱల నిట్లందురేల?

భరతు:—ఔనుసుమా! ఇంతలోనే మఱపునకువచ్చినది!!

ఉ॥ ఎంచుచు వెళ్ళఁబుచ్చితిమి యెట్టులొ యిన్ని దినంబు లగ్రజుఁ
గాంచుట యెప్పుడెప్పు డని కావునఁ, జిత్తము గంగవెఱ్ఱిచే
సంచలియించె, జ్ఞాపకపు శక్తి నశించె, నికెట్లు మాట ద
క్కించెదొ! తమ్ముఁడా! నిఖిలకృత్యము లీవయి నిర్వహింపుమా!

శత్రు:—అన్నయ్యా! తమ యాజ్ఞ కెల్లప్పుడును బద్ధుఁడనే గదా!

భర:—

ఉ॥ పొంచి నిశాచరుండు కితవుం డయి యెత్తుకపోయె సీత జీ
వించునె? స్వప్నవార్త; యొకవేళ నదృష్టము కల్గియుండి జీ
వించినఁ జూడ మిత్రుఁడును వేఁగ వైరము లేని యందు నా
కించుదనంబు చాల నుడికింపఁగ బిట్టుగ నేడ్వకుండునా?

చ॥ వదినె నిశాటుచేతఁ బడె; వంద్యగుణాఢ్యయె యైనఁ గాక యా
సుదతి; తదీయశీలపరిశోధనముం బొనరింపకున్న ద
క్కదు యశ, మట్లు సేయుటఁ నిగారపుఁ గార్యము కా దటంచు నె
య్యది యైనఁ బొలుపోక మన యన్నయుఁ బ్రాణము వీడకుండునా?

శత్రు:—

చ॥ వలనుగ నన్నువంటి పసివానికి ధైర్యగుణంబుఁ జెప్పఁగా
వలసినవాఁడ వి వ్విధినిఁ బామరుఁ డట్టుల వట్టి వెఱ్ఱిలో
పలఁబడు చింతకంతకును వాడుచు నుంటివి; అన్న! దైవదు
ర్విలసిత మిద్ది దీనిని స్మరింపక నిబ్బర మూని యుండుమా!

భర:—శత్రుఘ్నా! ఎట్లు స్మరింపకుందును?

సీ॥ రమణీయమణికిరీటము చేతఁ దళుకొందు
శిరముపైఁ గెంజడ లిరవుకొనఁగ;
బంగారు సరిగ దువ్వలువఁ గట్టెడు కటీ
తటమునఁ గావివస్త్రము నటింప;
ప్రాసాదవీథులఁ బరిఢవిల్లెడు మేను
చెడు ముండ్ల వనములఁ జిక్కువడఁగ;
'నవకాయ పిండివంటలఁ దేలువానికిఁ'
గందమూలంబు లాకఁటిని దీర్ప;
గీ॥ చిక్కి సగమయి మనలనుఁ జేర వచ్చు
రామభద్రుని నే నింక నే మొగంబు
పెట్టుకొని చూతు నాతని నిట్టు లడవి
పాలుచేసిన దౌర్భాగ్యభాజనుండ.

శత్రు:—అన్నయ్యా! ఆ మాయదారి విధి యిట్లు చేయుచుండ మన మేమి చేయఁగలము? ధైర్య మవలంబింపుఁడు. ఈ రాజన్యుల నందఱను వారివారి స్వస్థానములకుఁ బంపివేయవలసి యున్నది.

భర:—ఈ రాజలోకముం బురస్కరించుకొని జానకి నపహరించిన య ప్పుక్కడి రక్కసునిపై దాడివెడలఁ దలఁచితిమి గదా! మఱల నిదేమి?

శత్రు:—నిషాదాధిపుం డగు గుహుఁ డొక యుత్తరమును వ్రాసెను.

భర:—మాయలేడి రూపవచనములచే నన్నయు లక్ష్మణుఁడునుఁ జాల దవ్వేగిన సందుగాని భిక్షుకవేషమునఁ గొండొక రాక్షసుఁడు మన వదినె నపహరించెనని నాకు గుహుఁడే చెప్పియుండెను. మఱల నీ లేఖ యేమి?

శత్రు:—సలక్ష్మణుఁ డగు నన్నగారికి ససైన్యుఁ డగు సుగ్రీవుని తోడు దొరకినది. కనుక సహాయాంతరాపేక్ష లేదు.

భర:—సుగ్రీవుఁ డెవ్వఁడు? సహాయ మెట్లు దొరకినది?

శత్రు:— ఈ సుగ్రీవుఁడు కిష్కింధాధిపతియుఁ గపికులచక్రవర్తియు నగు వాలికిఁ దమ్ముఁడు. అన్నగారా వాలిని జంపి సుగ్రీవునకుఁ బట్టముఁ గట్టిరి. అందుచేత నతఁడు వారికిఁ దోడ్పడెను.

భర:—ఇది నిజమేయై యుండును. ఏల యన నొకప్పు డిరువురు ఖేచరు లాశ్చర్యముతో నొకరి కొకరు చెప్పుకొనుచుండ వింటిని.

శత్రు:—ఏమని?

భర:—తన కన్నకొడుకగు వాలి రామునిచేతిలో నిహతుఁడైననుఁ గార్యార్థియగు నింద్రుఁ డంతమాత్రమును వ్యాకుల పడుటలే దఁట!

శత్రు:—ఐన నీ వాలి యింద్రుని కొడుకన్నమాట. ఇంద్రుని కార్య మెట్టిదో!

భర:—ఇంక నొక సంగతి వినఁబడినది. శతయోజనవిస్తీర్ణమై యగాధ మగు సముద్రముపై ము న్నెన్నఁడుఁ గని విని యెఱుంగని సేతువు నొండు నిర్మించి రఁట!

శత్రు:—కనుక వానరులకును రాక్షసులకును యుద్ధము జరిగియుండవచ్చును.

(తెరలో)

మిత్రులపరాజయము! శత్రుల విజయము!! శత్రులేమిత్రులవలె బుజ్జగించుట!!!
కానిమ్ము. హిమాలయప్రాంతముల కేగి తపస్సు జేసికొనియెదఁ గాక.

భర:—యుద్ధప్రవృత్తు లగు నెవరో యొకరి జయపరాజయములఁ జింతించుచు నొక వృద్ధతపస్విని వచ్చుచున్నట్లున్నది.

(అంతట వృద్ధతాపసీవేషమున శూర్పణఖ ప్రవేశించును.)

శూర్ప:—(వెనుకటిదానినే మఱలఁ జెప్పును.)

భర:—తమ్ముఁడా! ఆమె యెవ్వరో ఎచ్చటనుండి వచ్చుచున్నదో యడుగుము. ఈమె వలన నన్నగారి వృత్తాంత మేమైనఁ దెలియునేమో!

శత్రు:—తెలియవచ్చును. (శూర్పణఖను జూచి) అమ్మా! నీ వెచ్చటనుండి వచ్చుచున్నావు?

శూర్ప:—(శత్రుఘ్నునిజూచి భయముతోఁ దనలో) నా ముక్కుచెవులఁ గోసిన యా క్షత్రియబ్రహ్మచారి యిచ్చటికిని వచ్చినట్లున్నదే! (నిరూపించి) ఈతఁడు లక్ష్మణుఁడు కాఁడు. అచ్చు మాతని పోలికనే యున్న యీతఁడు శత్రుఘ్నుఁడు కావచ్చును. (ముక్కుచెవులను దడిమి చూచుకొని) నా యీ తాపసీవేషమున ముక్కునుఁ జెవులును వచ్చినవి కనుక నా మాటలు విని యీమెకు ముక్కుతో మాట్లాడుట యలవాటు కాఁబోలు నని యనుకొందురు గాని యసలు సంగతి వీరికిఁ దెలియదు. (ప్రకా) అయ్యా! ఏ మనుచున్నావు?

శత్రు:—"నీ వెవరు? నీ రాక యెచ్చటనుండి?" యని.

శూర్ప:—(తనలో) రావణుని చెల్లెలను. లంకాద్వీపమునుండి. (నిట్టూర్పు విడిచి ప్రకాశముగా) నే నెవ్వతె నైన నేమి? యెక్కడనుండి వచ్చిన నేమి?

భర:—(తనలో) ఈమె నిక్కముగ తాపసి కాదు. రాక్షసపక్షపాతిని కాదు. ఈమె యేలాగో కంపలం బడ్డ కాకి వలె వగర్చుచున్నది. అన్నగారికిఁగాని లక్ష్మణునకుఁగాని యాపద కలిగియుండదు గదా! ఒకవేళ యీమె యిట్లుండుటకుఁ గారణము వేఱే యుండఁగూడదా! (ప్రకా) అమ్మా! నీ పే రేమి?

శూర్ప:—(తనలో) ఇతఁడే యగునా యేమి నేను చూచి మోహించి మోసపోయినది? (నిరూపించి) కాఁడు కాఁడు. ఇతఁడు భరతుఁడై యుండవచ్చును. (ప్రకా) అయ్యా! ఏ మనుచున్నావు?

శత్రు:—"నీ పేరేమి?" యని యన్నగా రడుగుచున్నారు.

శూర్ప:—(తనలో) నా పేరా? పుట్టినప్పుడు పెట్టినది. శూర్పణఖ. ఈ చేష్టలచేత వచ్చినది విగ్రముఖ. (ప్రకా) ఋశ్యమూక పర్వతవాసు లైన మును లందఱు నన్నుఁ బర్ణాదిని యని పిల్చుచుందురు. పులస్త్య బ్రహ్మవంశీయురాల నని వాడుక.

భర:—కనుక నీవు కిష్కింధనుండి వచ్చుచుంటి వన్నమాట.

శూర్ప:—ఔను.

భర:—దానిని పాలించుచున్నది వాలి గాదూ?

శూర్ప:—వాలి గాదు. అతనిం జంపి రఘువంశీయుఁ డగు రాముఁడనువాఁడు అతని తమ్ముఁ డగు సుగ్రీవు నందు స్థాపించెను.

శత్రు:—ఏమి నీవు రాక్షసివా?

శూర్ప:—(తనలో) ఇప్పు డేమి చెప్పదగినది? (కోపముతోఁ బ్రకాశముగా) పులస్త్యవంశమునఁ బుట్టినంత మాత్రమున నందఱును రాక్షసులే యగుదురా?

భర:—వత్సా! తపస్వినికిఁ గోపము రానీయకుము. విశ్రవసునకుఁగాని వైశ్రవణునకుఁ గాని రాక్షసత్వము లేదు గదా!

శూర్ప:—(తనలో) దౌర్భాగ్యుఁ డగు విభీషణునకు నట్లే. (ప్రకా) లెస్స బలికితివి.

భర:—ఐన నీ కి విచార మేల?

శూర్ప:—వినుము. మిత్రు లోడిపోయిరి. శత్రువులు గెల్చిరి. దుఃఖింప కేమి చేయుదును?

శత్రు:—నీకు మిత్రు లెవ్వరు? శత్రువు లెవ్వరు?

శూర్ప:—(తనలో) రాక్షసులు మిత్రులు. వానరులు శత్రువులు. (ప్రకా) వానరులు మిత్రులు. రాక్షసులు శత్రువులు.

ఖర:—(తనలో) అన్నగారి పక్షమున వినిపాతము దారుణముగ నున్నదే? (ప్రకాశముగ) వర్ణాదినీ! నీవు ఋశ్యమూకగిరినుండి వచ్చితి నంటివి గదా? అచ్చట యుద్ధము జరిగిన దా రేమి?

శూర్ప:—అక్కడఁ గాదు. లంకాద్వీపమందు.

శత్రు:—దానిని నీ వెట్లు తెలిసికొంటివి?

శూర్ప:—రుమాదేవి దాసి యగు శంకుకర్ణి యను నామె రుమ తన సవతితోఁగూడ నగ్ని ప్రవేశ మొనర్చుటఁ జూచి దుఃఖము పట్టఁజాలక ఋశ్యమూకగిరియందున్న నా సమీపమునకు వచ్చెను. ఆమెయే యీ సంగతియంతయు నాకుఁ జెప్పినది.

ఖర—(ఆవేగములో) రుమ యెవ్వరు?

శూర్ప:—సుగ్రీవుని పట్టమహిషి.

శత్రు:—ఏమి? రాక్షసులు సుగ్రీవునిఁ జంపివైచిరా?

శూర్ప:—(డగ్గుత్తికతో) అతని నొక్కనినే గాదు. అతని మంత్రియగు హనుమంతుఁడు, వాలిపుత్రుఁడు యువరాజు నగు నంగదుఁడు- వీరు వారననేల? అందఱు సకలసైన్యములతో నామరూపములు లేకుండ నశించిరి.

శత్రు:—ఐన నా రఘుకుమారు లేమైరి?

శూర్ప:—ఏమైరి? మాయావు లగు రక్కసులు. వారిని సైతము గంతపూర్తిగఁ గబళించివైచిరి.

ఖర:—హా సోదరా! రామభద్రా! వత్స లక్ష్మణా!(మూర్ఛిల్లును)

శత్రు:—హా! అన్న లిరువురు వనభూమికి బలియైరిగా? (మూర్ఛిల్లును.)

శూర్ప:—(తనలో) రాముఁడు నా యన్నలగు రావణకుంభకర్ణులను జంపుటకు విశ్వప్రయత్నముఁ జేయవలసివచ్చినది గాని యతని తమ్ములగు భరతశత్రుఘ్నులను మాట మాత్రముననే చంపుచున్నాను. (ప్రకా) అయ్యలారా! ఊఱడిల్లుఁడు. మీరెవ్వరో నే నడుగవచ్చునా?

శత్రు:—(మూర్ఛదేఱి) ఈతఁడు భరతుఁడు. నేను శత్రుఘ్నుఁడను

శూర్ప:—(ఆకులపాటు నటించి) ఏమీ మీరు రామలక్ష్మణుల సోదరులా? అయ్యో! అయ్యో!! ఎంత తప్పు చేసితిని. సత్యమే యైనను అప్రియము చెప్పఁగూడదని పెద్దలు చెప్పుచుందురు. అది తెలిసియుండియు నీ పొరపాటు చేసితిని. నేను నరకమునకుఁ బోవుదునేమో గదా? (రోదనము నటించును.)

ఖర:—(మూర్ఛతేఱి) ఇందు నీ దోష మేమున్నది. మేము మందభాగ్యులము.

శత్రు:—సీతాదేవి యే మైనది?

శూర్ప:—ఏమని చెప్పుదును? రాక్షసులు పెట్టు బాధలు పడలేక ఆ సాధ్వి గొంతుక కుతికపెట్టుకొని ప్రాణములఁ బోఁగొట్టుకొనెను.

శత్రు:—(శోకముతో) ఇఁక నేమి? సర్వనాశన మైనది. హా! జానకీ!

గీ॥ అల్లనాఁడు వనంబుల కరుగునపుడు
నారచీరలు ధరియింపనేర కెటులొ
అన్నగారిని గని నేర్చుకొన్న నీకుఁ
గుతిక కురివెట్టుకొను టెట్లు కుదిరె నమ్మ!

భర:—జానకీ! కులోచితము నాచరించి ధన్యురాల వైతివి. ఇప్పు డేమి చేయవలయునో నా కేమియుఁ బాలుపోవుట లేదు.

శత్రు:—అన్నయ్యా! పాలుపోవ కేమి? ఆ ముక్కిడిరక్కసుల నుక్కడఁగించివారి వేఁడివేఁడి క్రొన్నెత్తుటితో సోదరులకు దర్పణము లాచరింతము.

శూర్ప:—(తనలో)ఈ యువ దేశమును దప్పక త్రిప్పివేయవలెను. (ప్రకాశముగా) తగినంత 'సాయసంపదలు' లేని మన కది యెట్లు సాధ్యమగును? సీతయే దారి చూపినది గదా!

భర:—హా! ఎంత కష్ట మెంత కష్టము!

చ॥ దిన మొక నూరు కల్పముల తీరున నొక్కటి రెండు గా వెటో
చనెఁ బదునాలుగేఁడు లిదె చల్లఁగ వచ్చిన దన్న వత్తునం
చనిన దినంబు నేఁ డిఁకను హాయిగ నుందు నటంచు గంపె డా
సను గొని యుంటిఁ గాని యిటు సంభవ మౌటఁ దలంపనైతిఁగా?

శూర్ప:—(తనలో) మీ యన్నవలన బాగుపడిన దెవరు? నే నాతనిఁ జూచుటచేతనే ముక్కునుఁ జెవులనుఁ గోలుపోయితిని.

శత్రు:—

చ॥ కనుఁగొని తమ్ముగుఱ్ఱలను గౌఁగిటఁ జేర్చ; వ దేలకో యిటుల్
కనలుట? నవ్వువెన్నెలలఁ గాచెడు ముద్దుమొగంపు జందమా
మను గనుపింపఁజేయవుగ! మాటలఁ జెప్పవు కప్పురంబునన్
మునుకలు వేసినట్టులయి మోదిలి మేము వినంగ సోదరా!

శూర్ప:—(తనలో) ఆతఁడు నాకా నవ్వువెన్నెల మోముచందమామను జూపించెను. చూచితిని. కాని మనోరథము సాగలేదు. (ప్రకాశముగా) ఊరక చింతించిన నేమి ఫలము? ప్రతీకార మాలోచింపుఁడు.

భర:—

చ॥ ప్రకటనచేసి పాదుకల రాజ్యము సేయుము; తండ్రిగారి మా
టకు నెమ్మరై పనుల్ జరుపుటల్ తగ దీ పదునాలుగేండ్లపై
నొక గడె యైన నిల్వ నని యూఱడఁ బల్కితి వౌర! యప్పుడే
యిఁక నినుఁ జూడరా నని వచింపక పోతివి సత్యభామణా!

తపస్వినీ! అగ్నిప్రవేశముతప్ప నిఁక నేమి సేయఁగలము?

శత్రు:—లక్ష్మణుఁడు రాముని వలె నేను నన్నగారి ననుసరించి నా స్నేహమును ఫలింపఁ జేసికొనియెద.

శూర్ప:—(తనలో) ఇందుకొఱకే గదా నా యీ యారంభ మంతయు. (ప్రకా) భరతుఁడు చక్కని యుపాయము నాలోచించినాఁడు. శత్రుఘ్నా! నీవును మంచిప్రతిక్రియ నాలోచించితివి. నేను నిఁక దపస్సుఁజేసికొనఁ బోయెద. (ఇంచుక యాగి) తపస్సు మాత్ర మెందులకు? నేనును మిమ్ము ననుసరించెద.

భర:—తమ్ముఁడా! లక్ష్మణా! అన్నగారియం దనన్య మైన భక్తిఁ జూపించి జీవితము సఫలము చేసికొంటివి. నా కా యదృష్టము పట్టదాయెను. సోదరా! శత్రుఘ్నా! పున్నామనరకమునకు భయపడిక దా, మన తండ్రిగా రనేకకష్టములు పడి మనల నల్గురనుఁ గాంచిరి కావున నా మాట విని నీవు—

చ॥ గుఱుతుగ నిల్చియుండి జనకుం “డొక రిద్దరుఁ గారు నాకు న
ల్గురు సుతు లుండియున్ కడకుఁ గోరి పితృణము నీగ నొక్కఁ డ
క్కఱకును రాకపోయె”నని కందక యుండెడు నల్లు మాకు నం
దఱకును దర్పణంబుల నొనర్పుము వంశము నిల్పువాఁడవై.

శూర్ప:—(తనలో) శత్రుఘ్నుఁడు జీవించునా యేమి? నాకర్థాన్నమేమి? (ప్రకా) భరతా! శత్రుఘ్నునకును నీవంటి శోకమే కదా? నీ వట్లు నియోగించుట వృథయని తలంతును!

శత్రు:—తండ్రిగారికిఁ బ్రియపుత్రులరగు మీ రందఱు గతింపఁగాఁ దిలోదకములు విడచుట బాలుఁడ నగు నా కెట్లు సాధ్యమగును? నేనును మి మ్మనుసరించెద.

శూర్ప:—వత్సా! ఇంక నాలస్యమేల? అగ్నిహోత్రమును సిద్ధము చేయుము.

భర:—హా! రఘువంశ మింతటితో నంతరించుచున్నది గదా? ఎంత కష్ట మెంత కష్టము!

చ॥ కడుపుకుఁ జిచ్చువెట్టె రఘుకాంతుఁడు కోసలరాజనందనీ!
నిలువునఁ గొంపఁ గూల్చితివి నీవయి కైకరో! కాటి కివ్వనా

కొడుకులఁగంటి విద్దఱను గోరి సుమిత్ర? కులం బదెల్లఁ గీ
డ్పడుటకు హేతు వక్కటకటా! ఒక మంధరయే తలంపఁగన్.

హా! తండ్రీ!

గీ॥ పుత్రులో పుత్రులో యంచుఁ బొగిలి పొగిలి
కడపటను మమ్ము నల్వురఁ గంటి; వైన
నేమి ఫల? మాత్మజుని వనభూమి కంపి
పాడు చేసితి విక్ష్వాకువంశ మీవె.

శత్రు:—అన్నయ్యా! ఊఱక తండ్రిగారిని నిందించిన లాభమేమి?

ఉ॥ ఈ విధి నా నటం చెప్పుడు నెవ్వరమైనఁ దలంపమైతి మా
హా! విధి! నాఁడు పెండ్లిసమయంబున భూసురులెల్లరుం 'జిరం
జీవ!' యటన్న పల్కుల రచించిన దీవన లెల్ల వ్యర్థమై
పోవునె? ఇప్పు డడ్డుపడఁబోదొకొ ఒక్కటి యైన నక్కటా!

ఇంధనముల గూర్చుచున్నాను. అనలప్రవేశమునకై సిద్ధముగ నుండుఁడు.
(అగ్నిహోత్రముఁ బ్రజ్వలింపఁ జేయును.)

శత్రు:—అన్నయ్యా! అగ్నిహోత్రుఁడు విజృంభించుచున్నాఁడు.

భర:—నాకుఁ బ్రియము నాకుఁ బ్రియము.

శూర్ప:—(తనలో) నా కంతకంటెనుఁ బ్రియము. (ప్రకా) అగ్నిప్రవేశమునకై త్వర
పడుఁడు. త్వరపడుఁడు.

భర:—అమ్మా! మాయందు దయయుంచి నా యీ చిన్ననందేశమును వశిష్ఠున
కెఱింగింపుము.

శూర్ప:—(ఆనందముతోఁ దనలో) ఈ హేతువుచేత నే నగ్నిం బ్రవేశించుట తప్పిపోఁ
గలదు. (ప్రకాశముగా) ఏమని నీ సందేశము?

భర:—

ఉ॥ రావణుచేతిలోఁ బడిరి రాముఁడు సీతయు లక్ష్మణుండు;మా
కీవిధి దుర్భరం బగుట నేగుచునుంటిమి వారి వెంట నిం
ద్రావసథమ్ముఁ జేరఁగ; మహర్షివరేణ్యా! ఇతఃపరమ్ము మా
ప్రావకుఁ దప్పకుండఁ బరిపాలన సేయఁగదయ్య రాజ్యముల్.

శూర్ప:—(తనలో) నా మనోరథము ఫలించుచున్నట్లున్నది. ఇంకను ఆడించి చూచె
దను. (ప్రకా) ఇం దాయనకుఁ జెప్పవలసిన దే మున్నది. అమ్మహర్షికి స్వయ
ముగా నన్నియుఁ దెలియును. (అగ్నికిఁ బ్రదక్షిణము చేయును.)

శత్రు:—వరాదినీ! అన్నగారి సందేశము శీఘ్రముగా సెలవిచ్చి రమ్ము. ముందుగా మేమే యగ్నిలోఁ బ్రవేశింపవలసినది.

శార్వ:—(తనలో) వీరి కీయుద్దేశము దృఢముగానే యున్నది. ఇంక నేఁజేయఁదగిన దేదియు లేదు. (ప్రకా) సరే. మీ యనుశాసనము తప్పక చేయవలసినదే. విశేషించి యిటువంటి స్థితిలో—(నిష్క్రమించును.)

భర:—తమ్ముఁడా! ఇంక నాలస్యమేల? అగ్నికిఁ బ్రదక్షిణము చేయుదము.

(ఇరువురు నగ్నికిఁ బ్రదక్షిణము చేయుదురు.)

(తెరలో)

గీ॥ వచ్చుచున్నాఁడు శ్రీరామభద్రుఁ డిపుడె
పుష్పకవిమాన మెక్కి సమ్మోదగరిమ
నంకమున సీత ప్రక్కన ననుజుఁ డవల
వానరులు రాక్షసులుఁ బ్రీతి బలసి కొలువ.

భర:—(చూచి) ఎవఁడీతఁడు ప్రియము చెప్పుచున్నాఁడు.

శత్రు:—అన్నయ్యా! త్వరపడకుము. ప్రియవాక్యము వినఁబడుచున్నది.

భర:—తమ్ముఁడా! ఏల నీ కీ వెఱ్ఱి? ముందుగా మన మెవ్వరమో తెలియక యప్రియమును జెప్పి తరువాత ఖేదపడిన యాతపస్వినియే యిట్లు ప్రియము పల్కుచున్నది. ఇవి వట్టి మిథ్యావాక్యములు. (మరల నగ్నిని సమీపించును.)
(అంతటఁ బటాక్షేపమున హనుమంతుఁడు ప్రవేశించును.)

హను:—భరతా! నావి మిథ్యావాక్యములు కావు. ఈ కారణములేని కంగా రేల? జగదభిరాముఁ డగు రాముఁడు శతయోజన విస్తీర్ణమగు సముద్రము నవలీల దాటి నిఖిలదుష్టరాక్షస సంహారముఁ గావించి పుష్పకవిమానమెక్కి వచ్చుచుండా మిచ్చటికి వచ్చునప్పటి కాలస్యమగునేమోనని నన్ను ముందుగాఁ బుత్తెంచుటచే వచ్చితిని. క్షణ మాలసించినచో మాటదక్కనిదే.

భర:—మాయారణప్రవీణు లగు రక్కసులముందఱ మా రాముని శక్తి యెట్లు పని చేసినది?

హను:—వాలి నొక్క బాణముచేతనే సంహరించిన రామునకు రావణుఁ డొక లెక్కయా? గుడి మ్రింగువానికి గుడిలోని లింగ మెంత?

శత్రు:—ఏదో విని యాకులపాటున వచ్చిన తపస్వినివలన వ్యర్థముగ మనము తొందరపడితిమి. సమయమున కీతఁడు వచ్చి మనలను రక్షించెనుగాని లేనిచో మన మన్నగారికిఁ దీరని దుఃఖముఁ గూర్చియుందుము. (హనుమంతునిఁ జూచి) అయ్యా! మీ పేరున నుండ నోచిన పుణ్యాక్షరముల వినఁగోరుచున్నాము.

హను:—అయ్యలారా! నన్ను హనుమంతు డందురు. నేను వానరరాజగు సుగ్రీవుని మంత్రిని. మీ రేదో తాపసి యనుచున్నారు. ఆమె ఎవ్వతెయో నే నడుగ వచ్చునా?

శత్రు:—ఆమెపేరు వర్ణాదినియఁట!

హను:—వర్ణాదిని యెవరు?

శత్రు:—తాను ఋశ్యమూకగిరియం దుండుదాన ననియు, సుగ్రీవుని హితకోటిలోఁ జేరినదాన ననియు నామె చెప్పినది.

హను:—(ఆశ్చర్యముతో) వర్ణాదిని యను పేరు గల తపస్వినిని నే నింతవఱకుఁ గన లేదు. వినలేదు. (ఆలోచించి) అన్న యగు దశగ్రీవుని జంపిన కారణమున రామునిపైఁ గోపగించి శూర్పణఖయే యిట్లు తాపసీవేషమున మిమ్ము వృథగా నావేగపఱచినది.

భర:—(ఆశ్చర్యముతో) కావచ్చును. ఆమె పులస్త్యవంశీయురాల నని కూడఁ జెప్పినది.

(తెరలో మంగళధ్వనులు.)

హను:—(వినుట నటించి) ఆర్యా! రామభద్రుఁడు వచ్చుచున్న ట్లున్నది. ఎదు రేగుదము రండు.

(సీతారామలక్ష్మణులు తక్కిన పరిజనులతోఁ బ్రవేశింతురు.)

భర:—(సమీపించి) ఆర్యా! దశరథప్రియనందనా! భక్తజనవత్సలా! సత్యభాషణా! ఈభరతుఁడు చిరకాంక్షితము లగు నీ పాదకమలములకు నమస్కరించుచున్నాఁడు.

(రాముఁడు భరతునిఁ గౌఁగిలించుకొనును. రామ భరతులకు శత్రుఘ్నుఁడును లక్ష్మణుండును నమస్కరించి యాశీర్వాదముల నందుదురు.

భర:—(సీతనుఁ జూచి) తల్లీ! ని న్నే మొగము పెట్టుకొని చూతును?

చ॥ అడవులనుండ నేగుటకు నంతటఁ బోక దశాస్యు చేతిలోఁ
బడి పడరాని పాట్లు పడి వంతఁ గృశించుట కిట్టు లంతకున్
జడుఁడను నేనె కారణము జానకి! న న్నని మున్నుపట్టు లి
ప్పుడు దయఁ జూతువో? కినిసి బువ్వఁగ దిఁగట్టఁ జూతువో గదా?

సీత:—మఱిది! మే మడవులకుఁ బోవుటచేతనే దుష్టశిక్షణమును, శిష్టరక్షణమును మీ యన్నగారికి సమకూడినవి. ఇది యంతయు మా పిన్నత్తగారి దయచేతనే గదా!

శత్రు:—హనుమంతుఁడే రానియెడల నొక్క క్షణకాలము క్రిందటనే మేము మీ లోకమును బాసియుందుము.

రాము:—అ దెట్లు?

హను:—మీపైఁ గసితీర్చుకొనుటకై శూర్పణఖ తపస్విని వేషమున నిచ్చటకు వచ్చి మీరు మరణించినా రని చెప్పి వీరల నగ్నిం బ్రవేశింపఁ బురికొల్పి చల్లఁగ దాటి పోయినది.

లక్ష్మ:—ఆ దుష్టురాలి యిచ్చటఁగూడ దాపురించినదా!

సీత:—ఈ రామాయణమున కంతటికిని హనుమంతుఁడే పట్టుగొమ్మ—జీవము మనమాతని ఋణము నేఁడు జన్మములకును దీర్చుకొనలేము.

హను:—తల్లీ! ఎంత మా టంటిరి? నా స్వకృత్యమును నేను నెఱవేర్చుకొనుట గూడ నొక విశేషమా?

గీ॥ అరయఁ ద్వద్దాసదాసదాసానుదాస
సంఖ్య నూతైన పిదప నా త్రిశయణయుక్తి
నందుఁ గడగొట్టువానికి నర్చనంబు
సలుపు యోగ్యతయును నాకు గలదొ? లేదొ?

రాము:—పెద్దల యాశీర్వాదనప్రభావముచే మనమందఱము మఱల నొకరి నొకరు చూచుకొను భాగ్యము కలిగినది. ఇఁక నేమి కావలెను?

హను:—ఐన నిట్లగుఁ గాక!

(భరతవాక్యము.)

మ॥ ఇలఁ బాలింతురు గాక ప్రీతిమెయిఁ బృథ్వీశుల్; పరస్త్రీల దొం
గిలి యడ్డం బగు గడ్డినిం గఱచి సేగిం జెందు నా యాతతా
యులు లేకుందురు గాక! సర్వజన మత్యుత్సాహమౌఁ గాక! ఇ
మ్ముల రామాయణ మాదికావ్యమయి సొంపుం బెంపు వాటించుతన్.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది శ్రీ వెంకట పార్థసారథి కవి ప్రణీత మగు విచిత్రరాఘవమున
షష్ఠాంకము సర్వమును సంపూర్ణము.

